

జాతీయ నాటకము

# బహిష్కరణ

రచయిత:

రాయనం వేంకటరమణయ్య

జై హింద్

# బహిష్కరణ

కర్త:

రాయసం వేంకటరమణయ్య.
గోవిందపురం



1950



వెల 1—4—0

# మనవి



ఈ నాటకము యొక్క సర్వహక్కులును శ్రీయుత పోలూరి రామచంద్రయ్యగారి ప్రథమకుమారుడగు రామమూర్తిగారికి చెంద జేసితిని. నేను ఈ నాటకమును రచించుటకు కావలసిన సహకారము చూపి యథాశక్తిగా నన్ను సంతోషింప జేసినందులకు వారి కాయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధులు కలుగుగాక.

ఇట్లు,

**రాయసం వేంకటరమణయ్య**

# హెచ్చరిక

ఈ నాటకముయొక్క సర్వ హక్కులూ నావియైయున్నవి గనుక—నా లిఖితపూర్వకమైన అనుమతిని బడయనిదే నాయీ నాటకమును యెవరునూ ప్రదర్శించుటయే గాక సినిమా, రికార్డింగు, ప్రింటింగు వగైరాలకు వినియోగించుకొనరాదు. అట్లు వినియోగించినవారిపై తగిన చర్యను తీసుకొనగలను.

ఇట్లు,

**పోలూరి రామమూర్తి**

గవర్నరుపేట, విజయవాడ.

# ఇందు వచ్చు పాత్రలు



| | | |
|---|---|---|
| ప్రసాదరావు | ... ... | (కథానాయకుడు) |
| గంగాధరుడు | ... ... | (దీనజనాశ్రమాధికారి) |
| గౌరీనాథ్ | ... | కేంద్రకాంగ్రెస్ కార్యదర్శి |
| శేఖర్ | ... | |
| పద్మనాబ్ | ... } | |
| గిరిధర్ | ... } | కాంగ్రెస్ సభ్యులు |
| చంద్రం | ... } | |
| గురునాథం | ... | |
| శ్రీధరుడు | ... ... | (ప్రచారకమహాకవి) |
| కాంతం | ... | |
| గణపతి | ... } | లక్ష్మీసంపన్నులు |
| శ్రీపతి | ... } | |
| లక్ష్మంపతి | ... | |
| రాజ్యం | ... | కథానాయకి |
| ఉమాదేవి | ... | (సరస్వతీనికేతనాధికారిణి) |

నాట్యకర్త, బంట్రోతు.

ఓం

# 1

శ్రీధరుడు—(వీధివెంట పాడుతూ ప్రవేశించును.)

గ్రామగ్రామాదులనూ కన్గొంచి తుదకు యీగ్రామము నకు చేరితిని. నేను చూచిన ప్రతియొక గ్రామము పంచాయితీ ప్రభుత్వ పాలనమువలన ఘనీభవించినవి. ఇక యీగ్రామ పరిపాలనా విధానాధులనుకూడా పూర్ణముగాయవగాహనము చేసుకొనగలను. ఆహా పంచాయితీ ప్రభుత్వమును స్థాపించి పాలింపుచున్న మహనీయుల ప్రతిభావిశేషములు వర్ణనాతీత ములు కదా?

ఉ॥ హాయిగ యూరయూరికిని యమృతమూడని వారినుంచిపం
చాయతిపాలనంబు కడుశాంతియుతంబుగ నల్పుచున్నమా
నాయకి నాయకోత్తముల న్యాయవిశాలత కొల్వశక్యమే
లాయరుకైన భావియుగలార్డులకైనను గాడ్డుకైననున్.

కాని—

చ॥ మలినము యింకనీప్రజల మానసవీధుల గ్రుల్లుచుంటచే
కలతలు కొన్నినేటికిని కల్గుచు నున్నవి కాని యిప్పుడీ
వలయమునందు గూడి క్రిమబద్ధులునైజనులెల్లనిల్చుచో
ఫలమును యెంచగా తరమె భారతజాతికి లోపదేమున్న.

కాంతం—(ప్రవేశించి) వాస్తవికతా ప్రచారక మహాకవికి జోహారులు.

శ్రీధ—ఆదర్శ భారతీయ మహాపురుషున కజ్ఞాతవాసము తొలగుగాక!

కాంత—మెయ్యబోయి మెడకు తగిలించుకొనిన చందముగానున్నది. ఖాదీ వేషఘోషా యీ కవీ నేను యాదర్శ భారతీయుడనని మీకెటుల తెలియునూ ?

శ్రీధ—(చిరునవ్వుతో) వాస్తవికతా ప్రచారకమహాకవినని తమరెటుల తెలుసుకొనగలిగితిరో నేనునూ యటులనే తెలుసుకొనజాలగలిగితిని.

కాంత—అజ్ఞాతవాసివనికూడా మీకు తెలియునా ?

శ్రీధ—తెలియును. మీనిజరూపమును మరుగుపరచి తిరుగుచుంటిరని కూడా తెలియును.

కాంత—నీవు దేశద్రోహివని నాకునూ తెలియును. గనుక యీ గ్రామమును విడచి మరియొక గ్రామమునకు త్వరగా చేరుకొనుము. లేనిచో దేహశుద్ధి యగుటయేగాక జెయిలు పాలగుదువు.

శ్రీధ—ఎవరు దేశద్రోహులో యిక ముందు ప్రజలకు విదితముగాకపోదు.

కాంత—గ్రామ కుబేరుల రథసారథినై మనుచున్న నన్ను దేశద్రోహినిగా నిరూపింపజాలవు పొమ్ము.

(అని నిష్క్రమించుచుండును)

శ్రీధ—నటీమణిలేని నాటకమునకు సూత్రధారుడ
వైన నీవు నన్నేమి చేయగలవులే హో! ఓహో సోదర సోదరీ
మణులారా! దేశభక్తులెవరో, దేశద్రోహులెవరో తెలుప
గల రహస్యపరిశోధక వర్గములకు విరివిగా ఉపయోగ చేసు
కొనుడు. మరియూ:

ఉ॥ గ్రామవిరోధులౌ ఖలుల కుత్సితచర్యల కాపురుషాదిగా
లేమని భీతిజెందకుడు దేశమువైనను బాలినంత బల్
స్తోమతు నీయగాంచుడు సోదరులార ప్రజాప్రభుత్వమీ
ర్ఘామున గాన యేకమయి యుప్పున గస్తిదశాబ్దకూర్చుడీ

※

## 2

# గృహము

(రాజ్యం, గురునాథం, శ్రీధరునకు గారలుండగా ఖైర చేయును,
రాజ్యం శ్రీధరునిచే రచింపబడిన గ్రంథమును ముడిచి
మురియుచూ)

రాజ్యం— గురునాథం:

ఉ॥ వీరి కలంబులోన పదవీశల చక్కెర సారముండెనో?
కోరికతోడ తేనియను గ్రోలెనో తీయని ద్రాక్షపండ్లలో
సారము వోసెనో నిగమసారము నింపెనో యమృతమ్మునే
జారినదేమొ యంచు చవిచూచిన వారికి తోపకుండునే.

(సంతసముతో) కవీజీ! మీ రచనాశైలి కడుసుధా పూరితముగా నున్నది.

గురు— లక్షణయుక్తముగా నున్నది కూడాను.

రాజ్యం— తమరు గాయకులు కూడానా...?

గురు— మాయకులు కూడానేమో!

శ్రీధ— మాయకుడనుగాను. మీకా సందేహము వలదు. అవకాశ మీయగలిగిన వినిపింపగలను.

రాజ్యం— నిరభ్యంతరముగా వినికిడిపరుప వచ్చును.

గురు— వన్సుమోరులు కూడకొట్టవచ్చునా ?

శ్రీధ— టిక్కెట్లనుకొనని వక్రప్రేక్షక మహాశయుని వలెను మాత్రము కొట్టకుము (అనిపాడును)

రాజ్యం— (తన్మయురాలై) శ్రోతపుటంబులలో గల మలినము నేటితో నిర్మూలనమై పోయినది. గురునాథం.

ఉ॥ వీరి గళంబులో మధుర వీణియలున్నవా! కోటికోకిలల్
జేరియు గొంతులోన శ్రుతిజేయుచు గానము సేయుచుండెనో
నారదమౌని నాభిసదనంబున దాగి స్వదేశభక్తితో
యీరకమైన గానమును యింపుగపాడి ప్రతిష్టనిల్పెనో.

గురు— కేవలము ఈశ్వరుని వాహనుని యనుచరుడేమో!

రాజ్యం— మీ జాతీయ గీతాగానము శ్లాఘాపాత్రతగా నున్నది. సోదరా! ఇంకనూ యిటువంటి జాతీయగీతములను పెక్కువిధంబుల రచింపుచూ శ్రోతలనూ, పతితలనూ, తన్మయులనుగా జేయగలుగుదురని తలచుచూ నూటపదారులను బహూకరింపుచున్నాను. గ్రహించుడు.

శ్రీధ— వలదు తల్లీ! నేను తమకడకు ధనసహాయము నకు వచ్చియుండలేదు. మీ వలన నాకు కావగిన సహాయము మరియొకటి కలదు.

రాజ్యం—సాధ్యమైన చేయగలను గనుక వచింపుడు.

గురు—రొట్టెవిడిగి నోటిలోపడినదిలే వచింపుము.

శ్రీధ—నన్ను సరస్వతీనికేతనముననో లేక దీన జనాశ్రమముననో చేరిపింపగలందులకు యర్థింపుచున్నాను.

రాజ్యం—ఈ మాత్రముదానికి వారు పరులసహాయమక్కరలేకయే మిమ్ములను చేర్చుకొనగలరు. గనుక నా యీ బహుమతిని గైకొని పోయిరమ్ము.

శ్రీధ—ఒకసారి పోయివచ్చితిని తల్లీ! ప్రయోజనము లేకపోయినది. పైగా వారికి చాల యాగ్రహముకూడ గలిగినది.

రాజ్యం—అకారణముగా ఆగ్రహించియుండరు.

శ్రీధ—అయ్యది నా దురదృష్టమనుకొందును.

రాజ్యం—అదియునూగాక మీరుపోయిన వేళావిశేషమై యుండును. కానిచో యీ దంపతు లిరువురూ మీవంటి వారిని యెందరినో చేర్చుకొని పోషించిరి. పోషింపుచుండిరి కూడాను. ఒకరిమాట లటుంచి సోదరా! మా భార్యాభర్తలము వారిచే పోషింపబడి వృద్ధిగాంచబడిన వారలమే. మాకు పాణిగ్రహణ మహోత్సవాములనుకూడ యీ మహా నాయకీ నాయకు లొనరించి యింతవారిగా తయారుచేసినారు. అట్టి మహోపకారులు, అసమానశక్తి సమోపేతులు, దీనజనో

రాజ్యం—నిజమునే వచించితివి గాని మాకు యిప్పట్టున రావటమునకు వలనుపడదు.

శ్రీధ—మీరు రానక్కరయే లేదు మీ యభిమాన లిఖితపూర్వక పత్రిమును దయచేసిన చాలును.

రాజ్య—అటులనే; ఈ వాడుమాత్రము జనబోకుము. యేలనన యేత కార్యార్థులమై వారు మేము కూడ పోవనున్నారము.

గురు—అంటే గ్రామ పంచాయితీ ప్రభుత్వ సభ్యులను సమాయత్తపరచుటకు కేంద్ర కాంగ్రెసు కార్యదర్శియగు గోపీనాథులవారు దయచేసి యున్నారు. కనుక వారి దర్శనమునకై యేగగలము.

శ్రీధరు—చిత్తము. తరుణమును పారమాదియేతరల గలను.

రాజ్యం—(పరచియున్న చిరుచాపపై కూర్చుని రాజ్యం లేఖను వ్రాయుచుండును.)

ప్రసా—(ప్రవేశించి) మరల నేదియో రచింపుచున్నది.

చ॥ ఒకచిరుచాపపై భుజములొంచి సుఖంబుగకూరుచుండి తీ
రికను స్వాసీమయందవతరించిన పత్రముపైని యెద్దియో
సఖియ లిఖింపుచున్నయది సంస్కృతమో యది
యచ్చ తెన్గుయో!
యఖిల విధాలగా గణుతినందినయభ్యుదయంపు హిందియో!

రాజ్యం—రాజ్యం :

గురు—రాజ్యమునకు నైవేద్యమును గొనివచ్చితివా ?

ప్రసా—ఇదిగో తెచ్చితిని (పొట్లమిచ్చును)

గురు—తిప్పలా...?

ప్రసా—కాదు. తీపిని తెచ్చితిని.

గురు—కాళ్లతీపులనుకూడ తెచ్చుకొంటిరనుకొందును.

ప్రసా—అది సరియేగాని రాజ్యం: నీవు వ్రాయుచున్నది లేఖయా ?

రాజ్యం—ఔను.

ప్రసా—ఎవరికీ...?

రాజ్యం—గురుపత్నికి,

ప్రసా—గురుపత్నికా...?

రాజ్యం—ఔను...చకితులగుచున్నారేమా—?

ప్రసా—కారణముకలదు.

రాజ్యం—నుడువకూడదా !

ప్రసా—తొందరలేదు.

రాజ్యం—సరియే అర్థమయినది. పూర్తిచేసితిని కవీజీ! ఇక మీరు పోయిరాండి...

శ్రీధరు—నమస్తే...శలవు.

ప్రసా—మంచిది.

రాజ్యం—ఇకనైనా నుడువకూడదా ?

ప్రసా—చూడూ! నా జీవనజ్యోతీ! మాతృసమానురాలయిన యుమాదేవిగారికి మాతృభాషలో లేఖను వ్రాయవలయునుగాని యాంగ్లమున సర్వమునూ తెలిసిన నీవంటి గృహాలక్ష్ములు వ్రాయవచ్చునా ?

గురు—ఇంగువ వాసనైనా పోవునుగాని యింగిలీషు వాసనపోగలదా ! యువక కాంగ్రెస్ జ్యోతీ !

ప్రసా—శివ ! శివా ! ఎంత పనికిమాలిన పనిని చేసితివి రాజ్యం !

సీ॥ దివ్య కృష్ణా నదీ తీర వాసిని వౌచు
తెలుగుల కపకీర్తి తెచ్చినావు
అమరావతీ క్షేత్ర హంసగామినివయ్యు
కలగూర గంపలో కలసినావు
హంగైన హంపి విహంగమవై నీవు
యింగిలీకపుసేవ కొంగినావు
కావ్య గ్రంథము!పూయు కమలాక్షివై నీవు
క్రోటనుతో చెల్మి కోరినావు
తే॥ అన్ని విషయంబులకు గూడ నాదినుంచి
యగ్ర తాంబూలమునుగొన్న యాంధ్రమాత
గర్భగోళంబునందు నావిర్భవించి
కమ్మ పరభాషలో వ్రాయ గలిగినావ !

ఆంధ్రరాష్ట్రంబు సిద్ధింపనున్నదికదా యను సంతసమునుకూడ రూపు మాపితివికదా రాజ్యం !

గురు—ఈ యిడ్లీ సింహ్యానకు యులవిగాకపోయితివి కదే చక్కెర మిఠాయీ !

ప్రసా—రాజ్యం ! ఆంధ్రరాష్ట్రోద్యమంబునకుముందుగ యుంగ వేసిన నీవే యిటుల వకతవకగా చరియించిన మన మాతృశ్రీ సహించగలదా !

సీ॥ బాలచంద్రుని యంక భాగమందున జేర్చి
ముంగురుల్ సవరించి మురియగలవె
ఖడ్గతీక్ష్ణ ఫలను గని పెంచు గరితలు
వీరపూజకు నిన్ను పిలువగలరె
శ్రీనాథు లనుగోరు స్త్రీలకు సింధూర
తిలకంబు తీరుగా దిద్దగలవె
ఉద్యానలలోన త్యాగయ్యాత్మజులనుంచి
జోలపాటనుపాడ జాలగలవె!

తే॥ మరలమొల్లను గనుచున్న మహికి నెడకు
మంచి గంధంబు పూయగా మహిమగలదె
కమ్మ పరభాషలో వ్రాయగలవు గాని
రత్నగర్భకి పసుపైన రాయగలవె...

రాజ్యం—(భాష్పపూరిత నేత్రములతో జాలిగాజూచి) అంతటి యోగమున్న యెడల యిటువంటి యపచారమును చేయజాల గలుగుదువా...?

గురు—ఆంధ్రేతరుల చేతి మిఠాయిని గొనివచ్చిననీవు మాత్రము సామాన్యుడవా ప్రసాద్ : మీబోటి పెద్దలంతా మాబోటివారికి యిట్టిలే బుద్ధులను గఱపుతారు.

ప్రసా—(పక్కున నవ్వి) గురునాథం! నీవు చెప్పినటుల నేనుకూడ కొన్ని కొన్ని దురలవాటులకులోనైయున్నానోయ్! రాజ్యం! కోపమొచ్చినదా!

రాజ్యం—మీపయినగాదు.

గురు—నాపయినా! నాపిలకపయినా! లేక నాయీ పింజుకట్టుపైననా!

ప్రసా—ఎవరిపైనా...?

రాజ్యం—నాయీ కరముపైన చీల్చి వేయుడు.

గురు—ఈ ఖరముపైననా (అని చెంపలు కొట్టుకొనును)

రాజ్యం—సందేహింపకుడు.

ఉ॥ సాకినతల్లికిన్ దమకు సద్గురుకున్ సకలాంధ్రభూమికిన్
ప్రాకట వైభవోజ్జ్వల ప్రభావతియైన మహావేదమాతకున్
ఈకరమే విజానికి సహింపగరాని దురాపచారముల్
చేకగ జేసియున్నయది తెమ్ము నఖింపగ తెమ్ము కత్తెరిన్

గురు—(భయముతో) ఆగాదు యీ ఖరము యపచారములు చేయు సూకరముగాదు వధింపకుడు.

ప్రసా—ఇంతిలోనే నీకింతటి కోపమొచ్చునని యనుకొనలేదు రాజ్యం! కాని యదికరము చేసిన తప్పుగాదు.

గురు—ఎందుకీనిప్పు :

ప్రసా—అలవాటులను మార్చుకొనలేక పోయినందు వలన కలిగిన ముప్పు.

గురు—చివరకు వుప్పులేని పప్పుయైపోయినది.

ప్రసా—కాని వొక్కతప్పుతో లోగడ మనము చేసిన మెప్పులన్నియూ కాఫీకప్పులలో కలసి కావేరి నదీస్నానము నకు పోగలవుసుమా!

రాజ్యం—మీ పాదసాక్షిగా యికనిటువంటి తప్పులను చేయను (పాదములపై బడును).

గురు—ఈ ఖరముతేగాదు యికమీఁదట సూకరములు కూడా యిటువంటి తప్పులను చేయవు (అని పాదములపై బడును).

ప్రసా—ఇప్పుడుకదా తరించితిమి! మఱచితిని రాజ్యలక్ష్మీ నీకొకవార్తను గొనివచ్చితిని.

గురు—మిగిలిన మిఠాయీలక్ష్మీ! చుట్టుటకు నీకొక దినపత్రికను తెచ్చితిని.

ప్రసా—వినగలవా...?

రాజ్యం—పరమానందముగా వినగలను.

గురు—తినగలుగుదును గాని నేను మీ వ్రాఁతను వినలేను.

ప్రసా—పదవీవ్యామోహ మొక్క గణపతి శ్రీపతులకే కలదనుకొనినాము. ఇప్పుడు మీ యమూదేవిగారికికూడ కలదుట.

రాజ్యం—ఉత్తమాట. సర్వస్వమునూ సరస్వతీ నికేతనంబునకు ధారవోసి నిష్కామముతో సేవనుచేయుచున్న యమూదేవిగారికి పదవీవ్యామోహము కలదనిన పరిహాసమని యే నా యభిప్రాయము. అట్టి యిహలోక తాత్కాలికామోద పదవీవ్యామోహముల కాయమ యిసుమంతయునూ ప్రాకులాడదు. అట్టి వ్యామోహము మీ గురుదేవునకే కలిగియుండవచ్చును.

గురు—ఔను ఆయనగారికి లేకపోయిననూ కుబేర సోదరవేదురుల ప్రోత్సాహముచేతనైననూ కలిగియుండ

వచ్చును. అందుచేత కాంతయ్యగారి ప్రణాళిక విఫలమై పోగలదా !

ప్రసా—ఖాదీకాషాయ వస్త్రాలంకృతుడై దీనజనాక్షేమంబును దివ్యతరంబుగా నడుపజాలగలుగుచున్న మహనీయునకు పదవీవ్యామోహము కలదనిన పరిహసింతురు.

రాజ్యం—తమకు తెలియదు. అనేకసార్లు అయ్యగారు నాతో స్వయముగా నుడివినదికూడా.

ప్రసా—హాస్యమున కట్లు నుడివియుండవచ్చును.

గురు—కాదు. దీనజనాశ్రిత పాలనాభారమును తమ మూపుననుంచి తాను గ్రామపంచాయతీ ప్రభుత్వపాలనకు దిగగలనని మన మురహరయనితోకూడా మొరలిడినాడుట.

ప్రసా—ధనసహాయము గణపతి శ్రీపతులవలన గలుగుచున్నది గనుక వారిరువురకూ పదవుల నొప్పింపదలచియుందురేమోగాని వారికిమాత్రము కోరిక యుండదు.

గురు—తినబోవుచూ రుచియడుగుట యెందులకు.

రాజ్యం—ఘోరము. అట్లు వారు గణపతి శ్రీపతులకు పదవుల నొప్పగింపజూచుట ప్రజలను పులుల కొప్పగించిన చందమగును. మున్నువారు అన్నదానసమాజములకు ట్రస్టీలై, గుడిగోపురాదులకు ధర్మకర్తలై, అనేక ప్రజాసంస్థలకు సెక్రిటరీలై, మిగుల ధర్మవిరుద్ధముగా చరించినారు. అసహాయకుల రుధిరములను గ్రోలినారు, అది తమకు తెలియనిదికాదు. తమ గురువుగారికినీ తెలియనిదికాదు. గనుక యిటువంటి

ప్రసాద దుమారము లేవదీయుటకన్న స్వీయముగా తామే యేలికలగుట యుక్తమైనోత్తమము.

గురు—పాపమూయనమాత్ర మేమిచేయగలడూ, ఒక చేతితో నీ బేరులకు స్వర్గమును చూపుచూ ధనమును గుంజు కొనుచున్నాడు, మరియొక చేతితో నీచేలురకు పంచియిచ్చుచున్నాడు. కాని తాను మాత్ర మేమి సుఖపడుచున్నాడు. తాంచు యెటు మొగ్గునో యీసారి పంచాయితీ ప్రభుత్వ యెన్నికలతో కాని తేలిపోదు.

ప్రసా—సాధ్యమగునంతవరకు యట్టి ప్రమాదము దుమారము లేకుండుటకు తగిన సాధనములను వెతుక చూడ వలయును...రాజ్యం! వృథా కాలహరణమగుచున్నది. లెమ్ము ఈపాటికి కేంద్రకాంగ్రెస్ కార్యదర్శియగు గౌరీనాథుల వారు కాంగ్రెస్ కార్యాలయమునకు దయచేసియుందురు. ముందుగా మనమునూ చేరుకొనుట యతి యుచితము.

రాజ్యం—నేను సిద్ధముగ నేయుంటిని.

గురు—జై : పంచాయితీ ప్రజా ప్రభుత్వానికిజై !

ప్రథమ సాంగు

తెర వ్రాలును.

*

3

# వీథిలో

(శ్రీధరుడు గురునాథునితో ప్రవేశించును)

శ్రీధ—గురునాథం!

ఉ॥ చూచితి రాజధానులను చూచితి ఢిల్లీ పురంపు మేరనే
చూచితి పట్టణాధులను చూచితి పూర్వపుపల్లెటూరులన్
చూచితిగాని ప్రాథమిక సూత్రవిరుద్ధపు పల్లెటూరులన్
చూచియెఱుంగ నేటికిటు చూచితి దేబిరిగొట్టుయూరినిన్.

ఎక్కడచూచినా రొచ్చుగుంటలే: గచ్చుగొంపమచ్చుకైనా లేదు కదా:...

గురు—మీకు మురికిదుస్తులేగాని శిల్కుదుస్తులు లేవు కదా!

శ్రీధ—చూడకూడని ఘోరకృత్యములను యీగ్రామమున చూచితిని.

చ॥ కులబలగంబుజూచుకొని క్రూరులు కొందఱు యడ్డగోలుగా
పొలములగట్లు దున్నుకొని పొంగుచునుండిరి వారిధాటికిన్
నిలువగ లేక బక్కమహానీయులు నీరసభావులై కటా
కలిసెను యాజ్యకోరులలో, కానిజయింతురె సాత్వహీనులై.

అల్పసంఖ్యాకులైనకులజుల కింకా యెన్నెన్ని అన్యాయములు కలుగునున్నవి యోగదా! కటకటా యిటువంటి యూరులను చూడజాలను.

గురు—తోకలులేని నీబోటి కవులనుకూడా చూడజాలము.

శ్రీధ—జంతువులకు తోకలుండును గాని మనుజుల కుండునా గురునాధం :

గురు—ఎందుకుండవు స్వామీ? ఆడవారికీ మగవారికీ కూడా తోకలుండును. అందులో నాబోటివానికే తోకలుండగా యిక తమబోటివారి కెందుల కుండకూడదూ?

శ్రీధ—(ఆశ్చర్యముతో) తోక నీకుకూడా కలదా గురునాధం.

గురు—తోకతోకకుతోక, తోకతోకకుతోక తోక తోకయని ఒకటిగాదు నాకు నాలుగు తోకలున్నవి. ఇంకా యెన్నితోక లవతరింపనున్నవోకూడా నాకు తెలియకున్నది.

శ్రీధ—ఏమితోకలూ, ఏక్కడి పత్రికల్లో.

గురు—ఇడ్లీసింహ్వ! ఇడ్లీమార్తాండా! ఇడ్లీభీమకాక్షీ లోల, ఇత్యాదితోకలు. ఇక మా ప్రసాదరావుగారి యనుగ్రహముచే 'ఖర' యను తోకకూడా యిప్పుడిప్పుడే తొలకరించీ తొలకరించకుండా నున్నది. కడుపుతోనున్నమ్మ కనకపోతుందా. వొండుకున్నమ్మ తినకపోతుందా, అన్నట్టులే అవతరించినతోక పెకిలిరాకపోతుందా స్వామీ!

శ్రీధ—అవి బిరుదులుగా...?

గురు—మీకు నేను చెప్పవలయునా స్వామీ! (ఎగురుచూ) కుక్కలే శునకాలు కుండలే భాండాలు చిలుకా రామచిలుకా తోకలే బిరుదాలు బిరుదాలే తోకలు చెలుకా చిప్పెలుకా (పాడుటమాని) ఇప్పటికైనా తెలిసినదా స్వామీ!

శ్రీధ—శహభాష్ తెలిసినది. మంచితోకలనే సంపా దించుకొనినావు.

గురు—తోకలలోకూడ విభేదములు లేకపోలేదు. కొందఱికి మొండితోకలూ, మఱికొందఱికి రాతెండితోకలూ, యింకా కొందఱికి యిత్తడితోకలూ గలవు. కాని యిటువంటి తోకలుకావు నాకియిటుగని యినుపతోకలు; కవిజీ మీరు కూడా సంపాదించుకొనుడు. సుప్రసిద్ధ మహాకవులై పోగలు గుదురు.

శ్రీధ—నీబోటి వారలకున్న యందమూ చందమూ గాని నాకెందుకులే గురునాథం! కాని యీ తోకలను నీకెవ రిడినారాయని నా తాపము.

గురు—మొదటితోకను అంతే యిడ్లీసింహ్వాయను మురిపెంపుతోకను కాఫీహోటలు గడ్డేశయ్యరుగారు తన క్లబ్బులో కలుగ జేసినాడు.

శ్రీధ—పాపము నీపైన దయగలిగి కలుగజేసినాడా!

గురు—కాదు. అందరికన్నా యనేకరెట్లు హెచ్చుగా తప్పమును ప్రత్యేకము యిడ్లీకే చెల్లించుకొనుచున్న సింహ్వా బలుడనని యీ యినుపతోకను చదివించినాడు.

శ్రీధ—భేష్: ఇక ద్వితీయ యద్వితీయ తోకనో.

గురు—నాతో సమానముగా యిడ్లీతో ముష్టాముష్టి యుద్ధమును చేయగల వ్యర్థులు యీలోకములో మఱియొకరు లేరుగనుక నండూరి గాండూఖయాళిరావుగారు నాకావుక్కు తోకను ప్రసాదించినాడు.

శ్రీధ—వహ్వా భలేవాడవేనోయ్! ఇక తృతీయ మహాతోకనో!

గురు—పోకపోక నొక స్నేహితుని పెండిలికిపోయితిని.

శ్రీధ—సరియే మంచిపని చేసితివి.

గురు—అంతట మావాళ్లెల్లరకు కలపి నాలుగుబుట్టల పోటుపోటు యిడ్లెనులను మాత్రమే జమకట్టినారు. అవి నా కొక్కనికేనని యప్పళించితిని. మిగతావారు చప్పళించిరి. పెండ్లివారు పాడలెత్తి యీతడు యిడ్లీ భీముడుగాని సామాన్యుడుకాడని వెంటనే తోకను తొడగినారు,

శ్రీధ—వారేవా! ఇక యా చతుర్థ జర్జరీభూతమహా తోకనో!

గురు—ఘడియఘడియకూ కడవలకొలది కడవలు కాఫీని గ్రోలుదును గనుక కాఫీక్లబ్బుల యజమానులూ, కాఫీసప్లయి శాజీయులూ, కాఫీ పాత్రాది ప్రక్షాళనా శాజీయులు కాఫీ దేవాలయోద్యోగులూ కాఫీ పూజారులూ గిజారులూ అంతా కలసి నాఖర్చుతో వొక మహాసభను జేసి కాపీలో లాయను తోకను యిడినారు ఇకను మనప్రసాదుడేగాక రాజ్యముకూడా ఖరమా ఖరమాయని పలుకసాగినది. ఇక యేసుముహూర్తమున నాకా పంచమ తోకను వారు తొడగుదురో యని యెదురుజూచుచున్నాను. ఇదీ నాతోకల సమాచారము.

శ్రీధ—ఎన్నితోకలను గణియించు కొంటివోయి భైరవుడా!

గురు—ఆహా! భైరవుడాయని మీరుకూడా తోకను

తొడగనున్నారే. తొడగండిస్వామీ! తొడగండ మెప్పుతోక లను తొడగిననూ వలదనను.

శ్రీధ— నీతోకలతో వృధాకాలహరణ మగుచున్నది. యికపదవోయ్.

గురు—ఎచ్చటికి కాఫీహోటలుకా లేక పంచాయతీ సమరమునకా

శ్రీధ— కాదు ప్రచారమునకు

గురు— నేనుకూడానా...?

శ్రీధ—నీవుకూడా ప్రచారకుడవైతే గ్రామము కళ్యాణమయమై పోగలదు.

గురు— తోకలమయము కాకుకదా!

శ్రీధ— కాదు లేపదా.

గురు—(నిష్క్రమించును).

సీ॥ స్వార్థత్వమునుగూల్ప । జాలక యిహలోక
పదవులకై యేడ్చు । పాథితులార!
సహజపాండిత్యాది । సాహసత్వము లేక
బిరుదులకైజూచు । పిడుగులార!
గ్రామసంక్షోభావ సామరవ్యాపుల
శతఖండికలజేయు । శకునులాల!
దాతలు యిండ్లలో । దాచినసొత్తును
దోపిడిచేసెడి । ద్రోహులార!

తే॥ అహము విడనాడనటువంటి గృహిణులార!
ముందు వెనుకలుచూడని । మూర్ఖులార!

మొగరిపడక, పంచాయతీ యుగమునందు
భాగుపడుడయ్య సమరస భావులగుచు.



4

## కాంగ్రెస్ కార్యాలయము

[కాంగ్రెస్ కార్యాలయములో సభ్యులెల్లరూ కూర్చొని యుండగా తెర లేచును. ప్రార్థన గీతానంతరం గంగాధరుడు లేచి] మన కాంగ్రెస్ కార్యాలయము కేంద్ర కాంగ్రెస్ నాయకాగ్రణియగు గౌరీనాథుని రాకవలన ధన్యతనుగాంచినది. గనుక మనముకూడ వీరి సందేశ సారామృతమును గ్రోలి కృతార్థులము కాగలమని తలచుచున్నాను. మరియూ, లోగడ మన పాలకులు కొందరు కొన్ని కారణములచేత ప్రజల మన్నలను బడయలేకపోవుటచే యవిశ్వాసపాత్రులైనారు. గాన ప్రజలను క్షమాపణ గోరుచున్నాను.

ఎల్లరు... జేజేలు :

గౌరి—(లేచి) గ్రామీయులారా! గ్రామోద్ధారకులారా! గ్రామక్షేమాభిలాషులార : వినుడు...

చ॥ పరువుగలట్టి గ్రామ పరిపాలనకై సరియైన సభ్యులన్
సరగుననిల్పి రమ్మనుచు సమ్మతిపత్రము కాంగ్రెసివ్వ నీ
కరణిని మేగుదెంచితిని కాంగ్రెస్ కార్యగరిష్ఠులార! సా
దరమున మెన్నుకోదగిన దక్షులు మెవ్వరో తామె తేల్చుడీ

రాష్ట్రీయ ప్రభుత్వ పాలనమువలన ప్రజానీతికి తగిన సౌకర్యములు సమకూర్పజాలని హేతువుచే నేడు పంచాయితీ ప్రజా ప్రభుత్వమును ప్రతిష్టించినారు. గాన ధర్మబద్ధముగా పాలింపగలమను ధీరనాగరులైన నాయకీ నాయకోత్తములు నడుములను బిగియించి ముందునకు రావచ్చును......

గురునాథం— పిశాచసహాయంతోయున గంగాధరుని భుజస్కంధములపై నీ కార్యభారము నిడిన సులభముగా పరిష్కరింపగలము,

ఎల్లరు— జే జేలు......

గంగా—(లేచి) నాయకాగ్రణీ !

ఉ॥ బుద్ధుని సాక్షిసత్యమత పూజ్యతముండగు గాంధిసాక్షి, నే
బద్ధుడనౌచు కాంగ్రెసు నిబంధనకున్ పరిపాలనంబు బల్
శ్రద్ధగ జేయువాడనని చాటుచునుంటిని గానినాథ, మీ
యొద్ద నబద్ధమేల కనుదోయి ద్రవహించి చరించునారికిన్

గాంధి—ఔను. ఓర్పుగల మహనీయులుగనుక నే పదవీ వాంఛావిరక్తులై దీనజనాశ్రమమును పోషింపజాలగలుగు చుంటిరి

ప్రసా—కాంగ్రెస్ కార్యదర్శీ ! మాపాలిటి మహర్షీ ! నా దీనానిబద్ధ ప్రవచనాదులకు కూడా వినిపింపుచున్నాడను వినుము.

ఉ॥ బాధలనోర్చి ముక్తి బ్రటనువారికి బాటను చూపినట్టి గం
గాధరు పాదసాక్షి నిజకాంగ్రెసుసంస్థకు సభ్యవర్తినై

ఖేదముతీర్చెదన్ యొకలు గెలిచిచేయను భంగిసజ్జనా!
రాధితచక్రచిహ్నకుల రాజిత దివ్యపతాకధారినై.

ఉమా—(లేచి) ఉగ్రనాయకా! నా యభిభాషణలను కూడ వినిచూడుడు.

ఉ॥ వేదముసాక్షి నేకొలుచు వేల్పులసాక్షిగ తాళిబొట్టు యీ
నాడుగళానికిన్ చిఱుతనాడె సమర్పణ జేసినట్టి గం
గాధరరావుగారి పదకంజయుగంబుల సాక్షి నే ప్రజా
బాధలదీర్పగా బ్రతినబట్టితినిమ్ము యుదారబుద్ధితోన్.

రాజ్యం—కాంగ్రెస్ కల్పకమహారాజమహా! నా స్థిర సంకల్పమునుకూడ వెలుపరించుచున్నాను.

చ॥ పతి చరణారవింధముల । భక్తియుతంబున గొల్చి
ఆ య్యుమా
సతికిని శిష్యురాలనం । శాంతిప్రియుండు ప్రతాపశాలికిన్
సతినయి సద్భక్తియుత సంస్థను సేవను జేయకుండ గా
బ్రతుకుదునే సదా దీన భావము గాని ప్రజోపకారిణై.

శేషం—కాంగ్రెస్ దేవా! నా పత్నిత్రాభిప్రాయమును కూడ సాంగోపాంగముగా విని నా

ఉ॥ సంగర రంగమందు భుజశౌర్యముజూప ప్రతిపక్షులపై
పింగములాగు యేపురుషసింహ్వమదధూకెనోయట్టిస్వతం
త్రాంగుని బోసుబాబుని పదాంఘ్రులగొల్చి జనాళిసేవనే
పొంగుచుచేసెదన్ యొలకబోయక యుక్తవయస్సుశక్తినిన్

చంద్ర—పంచాయతీ పరిభుత్వసారధినై మీదయ వలన ప్రకాశించెదను.

గిరి——కార్యదీక్షానిమగ్న కంకణధారుండనై గ్రామో
ద్ధరణంబునకు పూనుకొనగలను.

పద్మ——ప్రజలకు తలలోని నాలుకగా మెలంగుదును.

గురు——మీ యీ దేశానుసారంబుగా తిరుగుదును.

శ్రీధ——నేనుకూడ యేకీభవింతును.

గణ——కాంగ్రెస్ సిద్ధాంతానుగుణ్యుండనై చరింతును.

లక్ష్మి——నేనుకూడ యేకీభవింతును.

గౌరీ——సభ్యులారా! మీ ప్రమాణ ప్రవచనాదులను
విని సంతసించితిని...కాని...

ఉ॥ బీద జనాశ్రయంబు జన ప్రీతికి నిల్చిన త్యాగమూర్తి గం
గాధరు డుండగా మనకు కల్పకవృక్షములాగు నండ నో
సోదరులారా! వేరె పరిశోధన చేయగనేల, మీతో సం
వాదము లేల సర్వము నివారణచేయగలండు యిప్పుడే!

మరియూ,

ఉ॥ వీరి కృపాకటాక్షమున బీదలు దిక్కులు భీతిలేక యీ
యూరను హాయిగా బ్రతుకుచుండిరి వీరికృపాప్తి లేక వా
క్స్వారస్యసేవచే ధనికవర్గములు సముద్రదమొందుచుండె, ఈ
ధీరునిచేతనే శక్తిసులాతీరును యెన్నికలందుగూడనుగా,

అదియునుగాక నో సోదర మహాశయులారా!

ఉ॥ వీరలిటుండగా యికను వీరియుమూసతి వీరికన్న నే
పారక శాంతయుద్ధమున సర్వవిధంబుల త్యాగశీలయై
పోరొనరించి ఖ్యాతికనుపొందిన సంగతి యెల్లవారికిన్
వేరెవచింపనేల కడువేద్యులు పూజ్యులు మీకు మాకునున్

గనుక మీలో తగినయోగ్యతలెవరెవరు గలరో వీరే నిర్ణయింపగలరు. అన్నింటికిని సమర్ధనీయుడగు మొదట తమరే నుడివితిరి. గనుక వీరి నిర్ణయ నిబంధనలకు బద్ధులమగుట సకలవిధంబులా శ్రేయోదాయకము ఇక యద్దదిడ్డ ప్రశ్నలచే బాధింపకుందురుగాక యని వేడుకొనుచున్నాను.

ఎల్లరు—(జేజేలు కొట్టుదురు)

శేఖ—యుక్తాయుక్తము లెఱింగి యెన్నికను జరిపించినచో నిరాక్షేపణీయముగా యంగీకరింపగలము.

గణ—అది నీకనవసరము.

శ్రీప—ఆదిలోనే హంసపాదా.

గౌరి—పదవీ వ్యామోహరహితులై, అపక్షపాతులై ఆశ్రితవాసులకు సేవలను జేయుచున్న యమోఘచరిత్రులు, కృతపవిత్రులూ గనుక వీరి యభీష్టానుసారంబుగా నడచుకొనుట మనకెల్లరకూ శ్రేయోదాయకము. కాంగ్రెస్ పైగల యభిమానముచే దయచేసినారుకాని వీరు పదవులపై ప్రీతిపడి దయచేసి యుండలేదని గ్రహింపుడు. గనుక యిట్టి సంస్కార ప్రియునకు, నిష్కామయోగికి నొప్పిదిగలిగించక చెప్పినటుల నడచుకొనుడని మరలమరల నుపదేశించుచున్నాను.

ప్రసా—(రహస్యముగా) ప్లేటును క్షణములో సిల్వరు ప్లేటును చేసినారు చూచితివా రాజ్యం.

రాజ్యం—చతురాననుడుగాని సామాన్యుడా!

గౌరి—మరియూ,

ఉ॥ పెద్దతనంబువచ్చినది వేడుకించిన వారు గాక నీ
రిద్దరు గూడ హా యిగను యీశుడు యీశ్వరిలాగు తప్పులన్
దిద్దుచు ప్రాణసఖ్యులయి దివ్యతరంబుగ యాత్రికూలతో
పొద్దులు పుచ్చుగాక యుపవాసన బీదజనాని కేయుచున్,

ప్రసా—మహా నేర్పుగా, చిచ్చుకొట్టినాడు రాజ్యాం.

రాజ్యా—ఒక మహా యీలపాటకుడు బాలపాటకుని మహిమలో మైమరచి పోయినాడు...

గౌరీ—ఇక కాలహరణ మేల గంగాధరంగారూ,?... మీ యిచ్చవచ్చినరీతి సమగ్రతాదృష్టితో శలక్షను జేసి గ్రామ పితామహాయను బిరుదును సార్థకనామధేయముగా జేసి కొనుడు.

గంగా—పెద్దలవాక్యమును త్రోసిపుచ్చక కర్తవ్యమును కొనసాగించుచుంటిని, నిరాశా వేశవశులైన సభ్యులు పిదప నిందింపకుందురుగాక...

ఎల్లరూ...జే జేలు...

గంగా—యువకశ్రేష్ఠుడూ, కాంగ్రెస్ కీర్తిశరీరుడు యుదారుడూ, ధీరుడూ, సుగుణోపేతుండైన మన ప్రసాదుడు, ముఖ్యార్హుండని నా మొదటి నిర్ణయము.

గౌరి—భేష్! భేష్! గురువుగారి నిర్ణయము కడు సమంజసముగానున్నది.

గంగా—ఈ రాజ్యశ్రీ, మహాయోగ్యురాలు, చిఱుత ప్రాయమునుంచీ, గురుభక్తీ, ప్రజాభక్తీ, పతిభక్తినికూడా

చాటుచుండెడు మహామోపేతురాలు, గనుక మహిళల తరఫున సభ్యురాలుగా నిలువ తగునని నా ద్వితీయ నిర్ణయము,

ఎల్లరు—భేష్! భేష్! గురువుగారి నిర్ణయము, కడు శ్లాఘనీయముగానున్నది.

గంగా—శేఖరంసహితముగా, యువక(శ్రేష్ఠుడూ, పండిత మ్మన్యుడూ గనుక సభ్యతాపదవికి యర్హనీయుడైనవాడనియే నా తృతీయ నిర్ణయము.

గౌరీ—మీా నిర్ణయము అద్వితీయముగానున్నది...

ఎల్ల—అమోఘముగానున్నది కూడాను...

గంగా—ఇక మిగిలిన రెండు స్థానంబులకూ గణపతి శ్రీపతులు తగుదురని నా యంతిమ నిర్ణయము.

ఉమా—నాకు పరమసమ్మతము.

లక్ష్మం—నాకునూ సమ్మత మే...

శేఖ— మేము సమ్మతింపము.

చంద్ర—ముమ్మాటికినీ సమ్మతింపము.

గిరి—ఏమాత్రముకూడా సమ్మతింపము.

పద్మ—ఎప్పటికినీ సమ్మతింపము.

గంగా—ఎందుచేతా?

శేఖ—లోగడ కొన్నికొన్ని ప్రజాసంస్థల కధిపతులై మిగులహానిని చేయుటచేత!

గంగా—అది కల్లమాట. సమ్మతించి తీరవలయును. ఏలనన మొదటినుంచియూ, కాంగ్రెసునకు ధనసహాయమును

విరివిగా చేయుచున్న శ్రీమంతులునూ, గుణవంతులునూ గనుక యర్హులనియే నా దృఢనిశ్చయము.

గుమ—హాస్యమంతులుగాని, గుణవంతులు గారనియే నా దృక్పథము!

చంద్ర—లోగడ వీరలు దగాకోరులై, యమాయిక ప్రజలను యనేకరీతులగా మోసముచేసి యీనాటికి శ్రీమంతులై సింహాసనములను, కబళింప జూచుచున్నారు. గాని కబళింపనీయము.

శ్రీప—అధిక ప్రసంగమునకు తావు యీయుచున్నారు. జాగ్రత్తసుమా!

గణ—పెద్దలనుజూచి సహించితిమి.

లక్ష్మం—గురుతుల్యులగు, గంగాధరుని యానతిని మీరరాదని గౌరీనాథులవారు మొదటనే విశదపరచినారు. గనుక బద్ధులగుటయే మన విద్యుక్తధర్మము.

చంద్ర—ధర్మవిరుద్ధమగు యెన్నికకు మే మెన్నండునూ బద్ధులము గాము.

శేఖర్—కాంగ్రెస్ సిద్ధాంతమునకే ప్రబలవిరుద్ధము గనుక, యేమాత్రమైననూ యంగీకరింపజాలము.

ఉ॥ పెద్దతనంబువల్ల నొకవేళ పొరంపడి నారలే, మొ, వీ
రిద్దరు గూడకాని తమరిద్దరినిన్ యెటు లొప్పుకొంద్రు యీ
పెద్దలు ముప్పురాదె మునుపే సగమైనటువంటి ఖ్యాతి మీ
రద్దికి నాశనంబగుచు రక్తస్రవంతులు పొర్లిపారవే!

శ్రీప—అధికముగా ప్రేలకుడు.

గిరి—మీరిప్పుడు స్వార్థపరులైనారని తెలుసుకొని నాము.

శ్రీప—మమ్ముల నేగాక పెద్దలనుగూడ దూషించు చుంటిరిగా.

గణ—ఉమాదేవిగారిని దూషించిన మీ నాలుకను, యేల చీలుకలు పేలికలు చేయరాదూ ?

లక్ష్మి—ఓసీ! నీ టిలవ్యాదమూ!

చ॥ తరమెఱుగంగలేక దయ తాల్చిన తల్లిని కల్పవల్లినిన్
నిరసనగా తలంచి కడు నీచపుమాటల కూయుచుంటివే
గిరిధర; చూడుమింక కడు గిన్కవహించి మహోగ్ర మూర్తినై
పరపర నీదు నాలుకను బాకున చీల్చియు కూల్చివేసెదన్.

(అని పైకి)

ప్రసా—(అడ్డుగాపోయి) బాబూ! మనము శాంతి ప్రియులముగాని యశాంతియుతులముగాము గనుక దురాగ్రహాయత్త చిత్తులుగాక మిన్నకుండుడు.

రాజ్యం—దీనికై యింత వివాదమేలా, సర్వమునూ శాంతియుతముగనే చక్కపరుచుకొనగలము. యించుక మిన్నకుండుడు.

గాగి—కాంగ్రెస్ కొలువుకూటమిని మారణహోమ కూపముగా తయారుచేయకుడు.

ఉమా—ఛీ! ఛీ! ఇటువంటి సహావేశములో పాల్గొనరాదు...

ఉ॥ పెద్దరికంబునిచ్చినిలబెట్టిన సిద్ధప్రబుద్ధులంత బల్
హద్దునుపద్దు లేకిటుల వాంధుని జేసి తలంటుచుండగా
బుద్ధశిలట్లుగాక జలపూనవ దేలను దీనబాంధవా
వద్దిక లేచిరమ్ము తలవంపులు గల్గినమీాద నోర్తురే.

ఇక నైనా లేచి రండి పోవుదము.

రాజ్యం—(వెంటనే పాదములపై వ్రాలి) తల్లీ! సభకు శాంతిభిక్ష నొసగుము

ఉమా—(క్రోధముతో) ఛీ! ఛీ! నా పాదములను ముట్టకుము. (అని చిరున లేచిపోవును.)

గంగా—(విరక్తితో) నాబోటివాండ్రు యిటువంటి చేతగాని పెత్తనములను నెత్తిన పెట్టుకొనరాదు.

గౌరి—పెద్దలు శాంతిని యాదేశింపుడు.

ప్రసా—శేఖరా, వాదవివాదములతో కార్యసాఫల్యతను గణియించుకొనలేమని యిప్పటికైననూ గ్రహించుకొనుము.

రాజ్యం—కడుసమర్థులూ శాంతియుతులూ గనుక చంద్రం గిరిధరులను యెన్నుకొనినచో చిక్కులు నివారణమగును గురుదేవా! మీారైననూ యంగీకరింపుడు.

గంగా—నాదేమున్నదీ మీా యెల్లరకూ యంగీకారమైనచో నిరభ్యంతరముగా నెన్నుకొనవచ్చును.

శేఖరం—మేము సమ్మతించితిమి.

ఎల్లరు—(జేజేలు)

శ్రీపతి—మేము కాంగ్రెస్ నుంచి విశిపోయి పోటీగా నిలచుటకుకూడా సమ్మతించితిరా ?

గౌరి—వీలులేదు బహిష్కరింపబడగలరు.

గణ—బహిష్కరించిననూ సరియే.

(నిష్క్రమింతురు)

చంద్ర—మీ యీ ముష్టిబెదరింపులకు బెదరుకొను వారముగాము.

శేఖర్—కాంగ్రెస్ మహాసంస్థతో బ్రిటీషు ప్రభుత్వమే గెలుపొందలేక, లోక ఝూడించినది. ఇక మీ రా పోటీ చేయునది.

రాజ్యం—ఎంతలో యెన్ని విషసంఘటనలు యెదురు ముట్టడించినవి :

చ॥ అతిసహనంబుతో ప్రజల నందఱినిక్గని యుద్యమాలలో
క్రితము మహోద్ధతిన్ విపులకీర్తిని చాటినపూజ్యులారాలుయీ
స్థితిగను చీదరించుకొని చీలి చివాలున లేచిపోయె, యే
యతుకులు తెచ్చునో ప్రవిమలాంధ్రసహోదరులార !
ముందికన్.

ఆమెయేగాక గణపతి శ్రీపతులుకూడాతొలగి చనిరి. యేమి కీడు రానున్నదియోకదా !

ప్రెసి—రాజ్యం! ఇటువంటి మత్సరాదులు మనలో మనలకు కలుగుచుండుట సహజమేకాని యీ కొలది మత్సరమునే హేతువుగా గైకొని కన్నతల్లి యగు కాంగ్రెస్ సంస్థకు తెలిసిన మహనీయులు దూరముకాగలుగుదురా! అందులో యుమా గంగాధరులు సామాన్యదేహధారులా!

ఉ॥ ఆమెను కాంగ్రెసేకని మహాత్ముగ వీరికి నిచ్చి పెండిలిన్
ప్రేమముతోడ జేసినది పెంచినతల్లిని కల్పవల్లినిన్
యేమని వీడగాగలరు యేటి జలంబుల పైని యల్గి మా
స్వాములు స్నానమాడమని శాబ్దివహించసరీతి రాజ్యమా!

గణపతిశ్రీపతులనుకూడా మన గురువుగారు మంజలింపగలరు గాన భయము విడువుము.

గౌరి—ఏదోవిధముగా నీనాటికి కార్యక్రమమును ముగియింపజేసితిమి. ఇక మిగతా కార్యక్రమమునుకూడా సుముఖతతో ముగియునట్లు చేసుకొనుడు.

ఎల్లరు—జై పంచాయితీ ప్రభుత్వమునకూ జై... ప్రసాదునకూ జై...రాజ్యశ్రీకీ జై...

తెర వ్రాలును.



## 5

(గణపతి, శ్రీపతి, లక్ష్మీపతి, కాంతంగారలు యాసీనులై యుండగా తెర లేచును. గృహము)

శ్రీపతి—(ఖిన్నవదనుడై) సోదరమహాశయులారా! అనేకమారులు ధనసహాయము చేసి కాంగ్రెస్ మహాసంస్థను కాపాడినది మనము.

కాంతం—ఔను దాని భారమును మనమే వహించితిమి...

గురు—మనము దానిని వరియించకపోయిననూ అది మనలనే వరియించినది.

గణ—నాయకుల స్వాగతములకూ, జయంతులకూ, జన్మదినోత్సవములకూ కావలసిన ధనమును సమకూర్చినది కూడా మనమే.

గురు—బావులను త్రవ్వించినదీ మనమే, పూడిపించినది కూడా మనమే.

లక్ష్మీ—అన్నసత్రములకూ, పుణ్యకార్యములకూ అన్ని వ్యవస్థలకూ యధిపతులము మనము.

గురు— ధర్మకర్తలమూ మనమే ధర్మభ్రష్టులమూ మనమే.

శ్రీప—మనవలననే సామాన్యపట్టణములు యలకాపురీపట్టణరాజములను ధిక్కరింపజాలగలుగుచున్నవి.

గణ—మనవలననే కాంగ్రెస్‌మహాసంస్థ ప్రతియొక్క యెన్నికలయందుననూ విజయశంఖారావములు పూరింపజాల గలుగుచున్నది.

గురు—మనవలననే యప్రతిష్టపాలగుచున్నదికూడా.

గణ—అట్టి దేశోద్ధారకులమైన మనలను, వాణిదోష్ట్యవులమైన మనలను గడ్డిపరకతో సమముగా చూచినారు.

గురు—ఖర యను తోకనుకూడా యీయమనినారు.

గణ—కడకొక్క ముఖ్యస్థానమునుకూడా మనకు దక్కనీయక పోయినారు.

శ్రీప—వారు ధర్మకవచములను తొడగినారుట.

లక్షు—దీక్షానిబద్ధకవచాదులు మనకు లేవుట.

కాంత—కాంగ్రెసునకు వారు సన్నిహితవారసులుట.

గురు—మనము బేవారసులముట.

శ్రీపతి—ఎంతటి నిర్లక్ష్యమునారమో మీరే యోచింపుకొనుడు.

గణ—గౌరవము రూపుమాయవలసినదేనా...?

లక్షుం—గ్రామపెత్తనమునకు తిలోదకము లిడువవలసినదేనా...?

గురు—రచ్చబండలు రజకులపాలైపోవలసినదేనా...?

శ్రీపతి—పలుకుబడి పలుచబడిపోవలసినదేనా...?

శ్రీపతి—తాహతు లేని దామోదరులకు దాసోహ

మనవలసినదేనా...? ఏమిచేయవలయునో మీరే యోచించుకొనుడు, ఏరకముగా నైననూ యెన్నికలలో మనము గెలువలేనిచో యెందుకునూ కొరగానివారమై పోగలము.

గణ—మరియొక రకముగా కక్షను తీర్చుకొనవలయునేగాని అసమానశక్తిని గణించిన కాంగ్రెసుతో చీలి యీ జన్మమునకాదు వుత్తరజన్మమందైనా పోటీనిచేయలేము. ఒకవేళ చేసిననూ గెలుపొందుట దుస్తరమూ, దుర్భరము కూడాను.

కాంత—నేనుండగా మీకా భయమక్కర లేదు.

గురు—భృహన్నలకు సాయపడగల వుత్తర కుమారుడు కూడా కలడు.

కాంత—మీకుగలిగిన ధర్మసందేహములను క్షణములో పటాపంచలు చేయజాలగలను. ఈనాడు ప్రతియొక మానవుడునూ స్వార్థమునకే యిలవడియున్నాడు. గనుక మనమెందులకు పోటీని చేసి విజయదుందుభులు మోగింపలేమో సుంత యోచించుకొనుడు.

గణ—మన ప్రజలు తమరనుకొనునంతటి దుర్బల హృదయులుగారు. గనుక కాంగ్రెసుతో పోటీనిచేయుట శోచనీయాంశము. ఇంతటితో విరమించుకొనుట శోభస్కరము కూడాను.

లక్ష్మం—చీమూ నెత్తురు లేని చవటనాగన్నలనవలసిన పిరికిపలుకులు గాని యివి చెలుకుపలుకులుగావు.

శ్రీప—మలపు లనవలసిన ముఱికిపలుకులుగాని పాపు కారు లనవలసిన పరబతు పంక్తులుగావు.

కాంత—శెహభాష్! ఆ మాత్రపు చులుకుతనమున్న సుముఖులు గనుకనే సలహా నిచ్చుచున్నాను. గెలచుటకు సాధనములను వెతకుచున్నానుకూడాను.

గణ—బ్రతికిపోవుదుము గనుక వెతకుడు ..

శ్రీప—రాచకీయ చతురంగ మహాయెత్తులకు పయియెత్తులను యెత్తగల బత్తుడవు మాలో నీవే గనుక వెతకుడు మీరు యోగ్గరమైన నిలచిన మేము నుగ్గునుగ్గు చేయమూ.

గణ—అంబ పలకమంటే పలకదూ!

లక్షు—నీకొక కుబేర పీఠ మమరగలదుకూడా.

కాంత—నామాటలు వినుకుంటే. మీకు కొమ్ములు మొలవమంటే మొలవవూ!

గణ—ఎందుకు వినమూ.

కాంత—సరియే వినుడు...ప్రజాదరణకు పాత్రుండైన మహానాయకుండు మన యీ గ్రామమునందు యెవరుకలరో మీకు తెలియునుగా...?

శ్రీపతి—తెలియును మన గంగాధరము గారేగా!

గణ—ఆయనగారి సతీమణికూడా మహానాయకురాలే.

కాంత—వారికి సాటిరాగలుగు. నాయకీ నాయకులీ ప్రాంతమున కలరా?

లక్ష్మి—ఈ ప్రాంతముననేగాదు; తదితర ప్రాంతములలోకూడ లేరనియే నా యభిప్రాయము.

ఉ॥ వారిని మించఁగాఁగలుగు వందననీయులు మేటినాయకుల్
లేరు ప్రదేశమందు, యిఁక పేరుస్వరాష్ట్రమునం ప్రకాశయు
ద్ధారులు దివ్యభావులు, యుదారులు వారితోఁ గారినాథుడే
పోరఁగ లేఁడు మున్నికలపోరున యన్యులు గెల్తురే మహిన్.

కాంత—గనుక వారు మహా ఘనులని తమకు తెలియును కదా...?

గణ—తెలియును. ఈ గ్రామమున పాలుత్రాగు పసికూనలకుకూడా తెలియును.

లక్ష్మి—సలుగురికి కావలసినవాడనికూడా తెలియును.

శ్రీపతి—ముఖ్యముగా కులభేదములు లేనిదే కుచేలురకు గంజినికూడా పోయజాలడన్న తెలియును.

కాంతం—వారిలో వారికి కలతలు కలిగినవనికూడా తెలియునా ?

శ్రీప—ఎందుకు తెలియదు.

గురు—కలతలు కలుగుటకు కారకులము మనమేగా!

కాంత—గనుక వారిని మనలో గలుపుకొనుట ముఖ్యావసరము.

గణ—కలియుట దుస్తరము.

లక్ష్మి—వారికి కాంగ్రెసుపైగల యాదరాభిమానములు వర్ణనాతీతము. మనలో కలియుట మహా దుస్తరము.

చ॥ కలిగిన బల్మినిన్, తనదుకల్మిని, కాంగ్రెసుసంస్థకై మహా
విలువగధారవోసి నిజవిప్రుడుగామనుచున్న త్యాగితా
కలియును కాంగ్రెసేతకుల గారడితంతులనమ్మి చిత్రమా!
ఫలితము లేదు పైగ నగుబాటగుసుమ్మి తలంపగానటుల్.

కాంతం—అదియంతయూ మీ కెందులకా నేను చెప్పి నటుల మీరు చేసినచో వారిని ముక్కాల మూడుఘడియల లో మనవైపునకు త్రిప్పి వేయగలుగుదును.

శ్రీప—సిద్ధముగనే యుంటిమని నుడివితిమిగా.

కాంత—మన మాారహారునకు షుమారు పాతిక వేల రూపాయలను సరస్వతీని కేతనాధికారిణి యగు యుమాదేవి గారు బాకీ యీయవలసియున్నది.

గణ—ఔను. ఒకని కేమిటీ మాలో చాలామందికి వుభయులూ బాకీపడియున్నారు.

కాంత—గనుక నాబాకీలవారంతాపోయి యొక్కమ్మడి వసూలునిమిత్తం వొత్తిడిచేయుట ముఖ్యసూత్రమైయున్నది.

శ్రీప—సరియే తరువాత!

కాంత—తరువాతసంగతి తరువాతనే విశదపడగలదు. నేను రహస్యమని కబురుపెట్టిన వెంటనే పైకముతో సహా బయలుదేరి సరస్వతీని కేతనమునకు రావలసియుండును. (రహస్యముగా చెవులోనూది) తెలిసినదా!

శ్రీప—చిత్తము తెలసినది.

గణ—మీవ్యూహము మోఘమైనదనికూడా తెలిసినది.

లక్షు—ఇతరుల కసామాన్యమైనదని కూడా తెలిసినది.

కాంత—ఇక అఖండమైనదని కూడా తెలుసుకొనగలరు లే.

ఎల్లరు—(జే జేలు)

కాంత—గురునాథం, దోర్లుడుపుచ్చకాయలాగు తిరుగుతున్నావు. జాగ్రత్తసుమా! గుట్టు బైటకుపోతే నీ—తోకలను కోసివేతుము.

గురు—సారకాయలను కోయవలసినదేగాని, నా తోకలను నీవేమి కోయజాలగలుగుదువూ? అందులో నావి పుక్కుతోకలూ యినుపతోకలుగా!

గణ—వీడితో నేమిగాని యిక కదలండి పోవుదము.

(జేజేలతో నిష్క్రమింతురు.)

※

6

[సరస్వతీ నికేతనములో పుమాదేవి క్రోధోన్ముఖురాలై యటు నిటూ తిరుగుచూ]

ఎన్నడూ కనివిని యెఱుంగని పరాభవంబును నేటికి చవిచూడజాలగలిగితిమి. తుదకు యానామధేయ కాంగ్రెసరుండైన శేఖరాథముని పలుకులకే విలువకలిగినది. మా సహాయము పేక్షించిన గణపతి శ్రీపతులకు యవమానము సిద్ధించినది.

ఎంతదారుణము. తలచిన హృదయము విదారకమగుచున్నది. సహించుటయా..? వారిని సహించి విడువరాదు. కీర్తిప్రౌఢిమ కూలినను, శాంతిజ్యోతి చల్లారినను, సరస్వతీనికేతనాధికృత సమసినను గరిమే సహించి విడువరాదు.

మురహ—ఉమాదేవిగారూ...!

ఉమా—ఎవరు వారు...?

ముర—నేను మురహరుడను.

ఉమా—బాకీ వసూలుకేనా...?

ముర—చిత్తం...అందుకే.

ఉమా—ఈ నెలవరకూ ఆగి రాకపోయినావా...?

మురహ—ఆగుట కవకాశము లేదు.

ఉమా—రావలసిన చందాలు వసూలుకాలేదు కొంత కాల మాగకూడదూ...?

ముర—వీలు లేదు.

ఉమా—వీలు లేదా...?

ముర—ముమ్మాటికీ వీలు లెదు.

ఉమా—అంత నిక్కచ్చగా మాటలాడుచుంటి వేమోయ్ !

ముర—నాకున్న బాధలటువంటివి...

ఉమా—సరియే రేపీపాటికి తల తాకట్టుపెట్టి తెచ్చి ఈయగలను పోయి రమ్ము.

మురా—ఇప్పటిచో యిబ్బందులకు లోనగుదుము.

ఉమా—మాటతప్పుట యనునది మా వంశముననే లేదు గనుక పోయి రమ్ము.

మురా—చిత్తము...(నిష్క్రమించును)

కాంతయ్య—(ప్రవేశించి) ఉమా దేవిగారు ప్రణామాః

ఉమా—అప్పుల బాధకు చావకుండా వున్నాను. కూర్చొనుము కాంతయ్యా!

కాంత—చేతులార చేసుకొనినారు. గణపతి శ్రీపతులకు తమరిచ్చిన వరములను, చెల్లుబడిని చేసుకొనగలిగిన యెడల మీ యప్పులూ, గిప్పులూ గుప్పునమాయమై పోకపోయినవా.

ఉమా—సైంధవులు దాపురించి వ్రతభంగము కావించినారు దానికి మేము మాత్ర మేమి చేయగలము.

కాంత—పైగా మీకా పరాభవము. మీకొతలవంపులు, లోకోత్తర మహాపురుషుడైన గంగాధరున కాయపజయము...హరి; హరీ! తలచిన కడుపు తరుగుకొనిపోవుచున్నది. ఇక మీకెటు లుండునోకదా! అవమానాగ్ని పరంపరల కాగలేక యా మహానుభావుండెంత హడలుచుండెనో కదా! తల్లీ! మీవంటివారికి తలవంపులు ఘటిల్లజేసిన విశ్వాసహీనులకు మీకే కాదు మేముకూడ ప్రబలవిరోధులమే! అన్ని విధములగావారిని యెదుర్కొనుటకు మేము తయారుగా నున్నాము గనుక విచారింపకుడు.

ఉమా—అవమానాగ్నికి యాహుతివేయకయే చల్లా రదు కాంతయ్యా! ఆలోచింపుము. సందేహింపక అగ్ని గుణ్ణములను తీయింపుము. మాయాపత్రిష్టలు విధ్వంసములై పోయిననూ సరియే వెనుదీయక దారుణ క్రోధపూరితహోమ గుణ్ణములకు ప్రదక్షిణములను చేయగలము గనుక చేయిం పుము.

కాంత—తల్లీ! ఊరడిల్లుము. శత్రునిర్భేద్యములైన వ్యూహములను పన్ని ప్రతికక్షులను ఢీకొనుటకు నేను సిద్ధ ముగనేయున్నాను. గణపతి శ్రీపతులుకూడా తరుణమునకై వేచియున్నారు గనుక యూరడిల్లుము.

గంగాధరుడుప్రవేసిస్తూ—ఉమా! ఉమా!

ఉమా—ఉన్నాను క్షీణచంద్రునకు స్వాగత మీయు టకు వున్నాను.

గంగా—పాలిపోయిన, నీమేనిపై, దిగచమట లావరిం చినవేమి వుమా!

ఉమా—మీ రింత యాతురతగా చనుదెంచుటచేత.

గంగా—నా యాతురతకేమి గాని వుమా! ఎంతపని జరిగినదో చూచితివా...?

ఉమా—జరిగినదేమో జరిగినది. ఇక జరుగవలసిన దానికై యూహింపుడు.

గంగా—అదికాదు. అప్పులవారు ముట్టడించినారు.

కాంత—చులకనైపోయితిరి గనుక చుట్టగించినారు.

గంగా—నికేతనములో విలువద్రవ్యమేమైనా కలదా?

ఉమా—ఇక్కడేమున్నదీ!

కాంత—పరాభవముతో కలసి పలాయనమైపోయినది.

ఉమా—ఇంకా మీ కడనే కలదనుకొనుచున్నాను.

గంగా—నీకెందుకూ...?

ఉమా—మీకెందుకో నాకునూ యందులకే.

గంగా—నాకుగలిగిన ఋణబాధ నీకునూ కలిగినదా?

ఉమా—ఎందుకు కలుగదూ?

కాంత—కడుపులో వ్యథబాధకూడా కలిగినది.

గంగా—గ్రామమున రావలసిన చందాలుకూడా వసూలుకాలేదు.

కాంత—ఇక వసూలుకాదు కూడాను.

గంగా—ఎందువలనా?

కాంత—గణపతి శ్రీపతులు వునూరు మనుటవలన,

గంగా—దాని కెవరేమి చేయగలరూ, ఇంతకూ వారికా యోగ్యతాపదవులు గొనవలసిన యోగము లేదు.

కాంత—మనకుండి యేడిచిననుకదా!

గంగా—నాకా తలపే కలిగివుంటే యీపాటికే సాధించి గలిగేవాడిని...

కాంత—ఈ జన్మమునకాదు. ఇక పుత్త్రజన్మమున సాధింపవలసిన దే...

ఉమా—నిజముగా నేనా...?

కాంత—ఒక చెంపన శనులాగ చూచియూ తమరుకూడ యమహానాయకురాలవలె యేడుగుట పాపిరా యేమా దేవి గారూ! మేమెల్లరము విూ యెడుగులకు మడుగులొత్తుదు మనియూ, గ్రామములో మీామ పలుకుబడిని ధ్వంసము చేసి ననుగాని తాము ప్రభన్నులము కాలేమనియూ చేసిన మోసముగాని మరియొకటిగాదు. మన వెఱ్ఱి ధర్మరాజు ఆమోసమేమిటో యావేషమేమిటో తెలుసుకొనలేక వారిని రాచుకొని పూచుకొని యింకనూ తిరుగుచున్నారు.

గంగా—మోసమా!

కాంత—కాకమరి యేమనుకొనినావూ...? అంతా మోసమే.

ఉమా—గనుకనే రసాభాసముగా మారినది.

కాంత—వెనుకటి విశ్వాసమువలన యించుక చిచ్చి కొట్టుటయేగాని సమయ మరుదెంచిన వారెల్లరూయడ్డుతగులు కొనువారలె యని యికనైనా యూహించుకొనుడు. గణపతి శ్రీపతుల మాటలటుంచి మీాకు పదవీకాంక్ష గలదని మన ప్రసాదునకు తెలియదా?

ఉమా—ఎందుకు తెలియదూ?

కాంత—పోనిండు మీరాజ్యమునకైనా తెలియదా.

ఉమా—దాక్షకేకాదు వారందరికీకూడా తెలియును.

కాంత—మాటమాత్ర మనకూడదూ?

ఉమా—కుడుములనిడి పండుగ యనుకొనమనినారు.

గంగ—చూచెదను,

కాంత—ఇంకా చూడవలసినదియే.

ఉమా—నేను బ్రతికియుండగానేనా? ఏమోనాకు నమ్మకము లేదు మన కోరికలు జతించి పోవలసినదే.

గంగా—కాదు. ఇప్పుడేచూచెదను. ఈ మరుక్షణము ననే చూచెదను. మోసమో లేక యే వేసమో యీ యుత్తరక్షణముననే ఫోనులో మీయెదుట మాటలాడి చూచెదను.

కాంత—ఆపాటి యోగమున్నచో మేమీపాటికి యం త్రలములను మోయకపోయినామా! స్వామీ! మీకా యోగము లేదు.

గంగా—ఫాలనేత్రమును తెరచి చూచెదనుగాక (అని చరచర ఫోనుకడకేగి) గౌరీనాథ్!

తెరలో...ఎవరు...?

గంగా—నేను గంగాధరుండను.

తెరలో...ఏమిశెలవు...

గంగా—ప్రజలు గొడవపెడుచుండ భరింపలేక పిలిచితిని.

తెరలో...ప్రజలు గొడవపెడుచుండిరా!

గంగా—ఔను.

తెరలో...ఏమని...?

గంగా—నన్ను సభ్యునిగా నిలువమని.

తెరలో...వీలు లేదు.

గంగా—నాకే వీలులేదా...?

తెరలో...ముమ్మాటికినీ వీలులేదు.

గంగా—ఎందుకు వీలులేదూ...?

తెరలో...ఇదివరకే నిర్ణయమై పోయినది గనుక. మరియొక సంస్థకు మూలాధారుడవగుటచేతి కూడాను.

గంగా—ఎందుకు వలనుపడదో చూచెదనుగాక.

తెరలో...విరుద్ధముగా ప్రవర్తించినచో కాంగ్రెసు నుంచి బహిష్కరింపబడగలవు.

గంగా—గౌరీనాథ్: బహిష్కరింపబడిననూ సరియే. పోటీగా యీ యుమా బాలగంగాధరులు సభ్యులుగా నిలచియే తీరగలరు. బహిష్కరింపువారు ప్రజలుకాని మీరుకారు.

తెరలో—ఆవేశము వలదుసుమా.

గంగా—బహిష్కరింపుడు. సిద్ధముగనేయున్నాను.

కాంత—ఉమాదేవిగారూ! విన్నారా!

ఉమా—విన్నాను.

కాంతం—ఆయనమ్మ పెండ్లి అణిగెనమ్మ రండీ "యనినట్లు" అనుకొన్నంతా జరిగినది.

గంగా—(క్రోధోన్మత్తుడై) నాకాయాంతయూయాయునది

కాంత—మిమ్మా బహిష్కరించునది.

ఉమా—మనలనా వెలివేయునది.

గంగా—బహిష్కరింపబడనున్న యీ గంగాధరుని సామార్థ్యంబును చవిచూచెదరుగాక.

చ॥ విలయముసంభవించినను, విశ్వవికాసము రూపుమాసినన్
వలలను పన్నినన్ అరులు. వాగులు, వాహిను లడ్డగించినన్
కలవర మొందకుండ యిల కాంగ్రెసుసంస్థకు పోటిగా నిదే
నిలచెద గెల్చెదన్ మనుజ నీతికి భంగమురాని భంగిగాన్

కాంత—జై గంగాధరునకూజై, గంగాధరునిపార్టీకీజై!

గంగా—ఏమైననూసరియే మనమిప్పుడు స్వతంత్రతగా నిలచి తీరవలసినదియే.

ఉమా—మనమేకాదు. మనతోపాటు గణపతి శ్రీపతులుకూడా సభ్యులుగా నిలచితీరవలసినదియే.

కాంతం—మేరుమంధరులలాగు వారు మన కండగా నుండి తీరవలసినదియే.

ఉమా—అదిగో కులగిరులలాగు రానే వచ్చుచున్నారు.

శ్రీపతి—రాం! రాం!!

గణ—మన పంతులుగారు దిగులుపడి కూరుచున్నా రేమి కాంతం,

లక్ష్మం—కారణ మేమై యుండునో కదా.

చ॥ తొణకియెఱుంగ డెన్నడును దోషహీనుండును మాధవుండు, యీ
దినమున యేలనో మహోక తీరున క్రోధదవానలమ్ములో
జననము గాంచినట్టి గ్రహచారదుర్వారధూళికిఁ
వణకుచునున్నయట్లు గనువారికి తోచెడు హేతువేమొకో.

కాంత—గౌరీనాథులవారు గురువుగారిని బహిష్కరింప గలుగుదురట... దీనజనాశ్రమాధికారులు గాన సభ్యులుగా నిలచుట కనర్హులట.

గణ—కేంద్రకాంగ్రెస్ కార్యదర్శియగు గౌరీనాథుండే కాఠిన్యతాహృదయుండై యటు పలికినాడుగా...?

కాంత—గ్రామ యువకాంగ్రెస్ ప్రముఖులు పలికించి నటుల పలికినారు. వారితప్పేమున్నదీ...?

శ్రీపతి—మేము చీము నెత్తురు లేని చవటలముగాము గురుదేవ్! సంకోచరహితులై వోటరుల జాబితాలను తయారుచేయింపుడు.

గణప—ఇదిగో మువ్వురమూ కలసి మీకు మూడు లక్షల యేబదివేల రూప్యములను ముట్టచెప్పుచున్నాము. నై

కొని ఋణవిముక్తిని పొందుటయేగాక గెలచి మా విశ్వాస మును జూరగొనుచూ క్రోధవిముక్తినికూడా చేసుకొనుము.

లక్ష్మం:—ఎన్నికలకు కావలసిన ధనబలగములను మే మే యేర్పరుచుకొనగలము. గనుక విచారముడిగి రథాధి రూఢుడవై కార్యక్రమమును కొనసాగింప చూడుడు.

గంగా.—(పుచుకొనుచూ) మిత్రులారా!

చ॥ బ్రిటను ప్రధానివచ్చి తమబింకము చాలని మందలించినన్
హాటమును మానుడంచు మన హైందవమంత్రులు గూడ చెప్పినన్
యిటలి యిరాకు దేశజులు యిర్వినుగిర్వను లొచ్చి చెప్పినన్
పటుతర శాలినై వినక పార్టివహించి జయించితీరెదన్.

గనుక యభ్యంతరములు చెప్పక మీరుకూడా పదవీ ప్రాప్తికై పట్టుదలతో పనిచేయుడు.

ఎల్లరు—దీనజన బాంధవులైన శ్రీ శ్రీ శ్రీ గంగాధరు నకూజై...

(పరుగుపరుగున ప్రసాదు —ద్యాముఖు ప్రవేశించి గంగాధరుని పాదముల వ్రాలుదురు.)

ప్రసా—మా తాత్కమింపుము. గురుదేవ్! అనుగ్ర హింపుడు.

చ॥ అలగినచో మహామహులు ఆంధ్రపతాక ప్రతిష్ట నిల్పునే!
తొలగినచో గురూత్తములు తొంబది తొమ్మిదిదార్లు తొక్కరే

తెలుగులు కేటరై నిలచితే మన గ్రామము ముక్కలవ్వదే
చులకనగా పరుల్ మనలజూచి హసింపరె ధూమమేలదే

గంగా—నేటి కొంతవాడవైతివిరా ప్రసాద్! నాకే నీతులను గఱపదలచి వచ్చివిగా...

రాజ్యం—గ్రామపితామహా!...

ఉ॥ హాయిగ యాత్రమంబున మహాత్మునిలాగువరించి ఖాది శా
షాయి కులాయినిక యకలుషాత్ముల నేలుటమెప్పగానివం
చాయతి రాజ్యనిర్వహణ సాగరమీదగ జూచుటొప్పనే
మాయలమారి యాశ్వేతుల మాటలునమ్మి గుర్యాద్వతం
సమా!

ఉమా—ఇంకనేమీ! రాజ్యలక్ష్మికూడా మనకు చెక్కుట్లు దిద్దజాలగల సమర్థనీయురాలైపోయినది.

రాజ్యం—తల్లీ! ఈరాజ్యము నీరాజ్యముకాదా? దుర హంకారులరీతిని యీ రాజ్యమును చీలికలు పేలికలుగా చీలతీసిన మహాసంకటములు సంభవింపవాతల్లీ: ఇప్పటికి రెండు తునకలగుటచేతనే మతోన్మాదుల ధాటికి తాళలేక ఈనాటివరకూ తపించిపోవుచున్నాము. ఇక పెక్కుతునకలైన ప్రజలు భరింపగలరా తల్లీ!

ఉ॥ మాతవు నీవు మాకు యింక మాతవు బీదజనానికెల్ల మా
నాతులపట్ల విద్యలను నాటికి నేటికి నేర్పుచున్న ధీ
మాతవు గాన నీవెయపమార్గముజూపిన శాంతియబ్బునే
ఖ్యాతి నశింపదే మరల కాలిడజూడరె శ్వేతవర్తకుల్.

ఉమా—చాలు! చాలు! నీమాత్రము మాకు తెలియక పోలేదు. ఇందులకేనా మీరు వచ్చినది.

గణ—మరింకెందులకోననుకొనినాము.

గంగా—మాకు మీరు చెప్పనక్కర లేదు.

కాంత—మీరేకాదు సకల బ్రహ్మాండ నాయకుడొచ్చి చెప్పిననూ వినువారముకాము.

శ్రీపతి—ఇదియొక యెత్తు,

గణ—మీయెత్తులు గిత్తులు మాకడ పనిశాయవు.

లక్ష్మం—గురువునకు పంగనామాలు పెట్టుటకా వచ్చితిరి.

గంగా—మిత్రులారా!

ఉ॥ వీరలెకాను ఢిల్లిపుర పీఠము లెక్కిన ముఖ్యనాయకుల్
చేరగవచ్చి చెప్పినను చేవనుచూపక యించుకంతయున్
పేరును మాపుకోను కని పెంచిన కాంగ్రెసు సంస్థలిల్లికిన్
తీరియెపోయె నారుణము దీనికి హేతువు గౌరినాధుడే.

ఉమా—గనుక గౌరీనాధునికడ కేగి బాపురమనుడు. మాకడ నావురుమనుట మీకు లాభదాయకముగాదు.

ప్రసా— గురుదేవ్, తమకు నిజముగా పదవీవ్యామోహామే కలిగియున్నయెడల మేము వైదొలగి తమకు చెండ జేయగలము. దయచేయుడు.

గౌరీ—ఈ తెలివి నిన్న నేమైపోయినదీ!

శ్రీప—అందితే జుట్టూ అందకుంటే పాదములా!

రాజ్యం— ఈ శిష్యపరిమాణువు లీయవలసిన గురు కట్నము లవియేనని తలచినచో యభ్యంతర మేమాత్ర మునూ లేదు. దయజేయుడు...

కాంత—సర్వసమర్థనీయుండగు గురుపుంగవునకు తమ రిచ్చుటయూ, వారు పుచ్చుకొనుటయునా?

శ్రీప—చేతగానివారి కీయగలుగుదురా...?

గంగా—ఈయవలసినది ప్రజలు; తమరు కారు.

రాజ్యం—ధనకాంక్ష కలిగినచో శక్తి కలిగినంతవరకు తీర్పజాలగలము.

ప్రసా—మీదయవలన మేముకూడ శ్రీమంతులమే. గావున యనుగ్రహింపుడు...

గౌరి— పదవీలోలుడు కావచ్చును గాని కేవలము ధనకాంక్షాలోలురని తలపబోకుడు.

శ్రీప—రాచకీయ బాధితులకు యీవు లీయుచు న్ననూ చేయిచాపని నిష్కామయోగిని ధనకాంక్షాలోలునిగా భావించుకొనుచుంటివా ప్రసాద్!

లక్షుం—లక్షులకు లక్షలు యీయజాలగల యక్షు లమూ, దక్షులమూ కలిగియుండగా యిక యీయక్షపక్షులా మీకు చాలినంత యీయజాలగలుగునది...

గంగా—ఇంతట గౌరవముగా తొలగిపోయిన మీకు

కొంతలో కొంత మేలుకలుగగలదు.

ఉమా—లాభము లేదు. యిక తరలవచ్చును.

ప్రసా—లాభము లేదా...?

గంగా—ముమ్మాటికిని లేదు.

కాంత—ఏమాత్రముకూడ లాభము లేదు.

ప్రసా—గ్రామమును చీలికలు పేలికలుగా చేయవలసినదేనా? గురుదేవా! మాతృద్రోహము కూడదు మహా ఘోరము. ఏతల్లి స్తన్యపానంబును గ్రోలి దుర్భరదారిద్ర్య దాస్యశృంఖలముల బారినుండి విముక్తినిజెంది స్వతంత్రులమైతిమో! ఏతల్లి మహత్తర శక్తిసామర్థ్య సహాయ సాధనాదులచే చెరసాలలో చావక శాంతిసమరమున అమ్ములు నిరాఘాటకముగా చలుపగలిగితిమో! ఏతల్లి కృపాకటాక్ష వీక్షణావళులచే ఆగష్టు పదిహేనవ తేదీన స్వతంత్రదినోత్సవమును జగజ్జేగీయమానముగా జేసి విజయ శంఖారావమును దశదిశలు మారుమ్రోగునట్లు పూరింపజాలగలిగితిమో ఆ మహాతల్లి యగు కాంగ్రెస్‌మాతకు దూరముగా తొలగి చనరాదు. భారతదేశమున మన కాంగ్రెస్‌తల్లికి బలహీనత సూర్చిననాడు చుట్టూ కాచుకొనియున్న దుష్టశక్తులు ప్రళయ తాండవం చేయగలవు. మనదు మాతృసంస్థకు తలవంపులు తెచ్చిననాడు భారతజాతి నిర్వీర్యమై నిస్తేజమై, చైతన్యరహితమై పోగలదు గనుక యోచింపుకొనుడు.

శ్రీప—నీ యీ గంభీరోపన్యాసమును విని వేయుటకు ఫూలహారమైనసూ లేదు.

గణ—ఇక నీవీరంగము చాలుగాని కదలుము.

కాంత—మీమాత్రము మాకు తెలియకపోలేదు.

పరినా—ఛీ! దేశద్రోహులారా! మీ ముఖము లను చూచిన పంచమహాపాతకములు చుట్టుకొనగలవు. మీ బోటివారు స్వార్థపరులై, స్వామిద్రోహులై దేశము ను పర దేశీయుల పాలుగా జేసి బానిసదేశముగా తయారుచేసినారు. నేటికి మహనీయుల కృషిఫలితము వలన విముక్తిని బడసిన యీ దేశమును సఖమైవచ్చిన యీ దేశమును, మరలమీరు చీలికలు పేలికలు జేసి యేలుకొనజూచుచున్నారు. ఇది మీ వినాశమునకే సుమా!

కాంత—నోరుమూయుము. మీ రేకాదు మేముకూడ దేశభక్తులమే.

రాజ్యం—(అశ్రుపూరిత నయనాలతో) మాతా! అటు చూడుమా! మీచే ప్రతిష్ఠింపబడిన త్రివర్ణ పతాకముల చుట్టూ గాలి దూమారములు క్రమ్ముకొని వచ్చుచున్నవి. రమ్ము తల్లీ! కాపాడుకొనుటకు రమ్ము. అపరయుమాదేవివై యరికట్టుము. అశాశ్వితమైన పదవీవ్యామోహామునకు చేసిన త్యాగములను బలిగానీయక శాశ్వత శాంతిదాయినియైనమన ధర్మచక్ర పతాకమును తూలిపడకుండ పట్టుకొనుటకు రమ్ము, తల్లీ! జాలిలేదా? ఏమతమునకునూ, ఏకులమునకునూ

ఏవర్గమునకు ఏదేశమునకునూ హానిచేయక మహోపకారము లనే సదా చేయుచున్న ధర్మచక్ర చిహ్నాంకితముపై నీకిట్టి విరక్తి యేల కలిగినది తల్లీ! ఆ పతాకచ్ఛాయల క్రిందను కదా మమ్ములను సాకితివి, ఆ పతాక ప్రభావమువలననుకదా అనేక కష్ట సాగరములను యీదజాలగలిగితివి. పంచాయితీ ప్రజా ప్రభుత్వ పాలకపీఠములూ, భవనములూ, భువనములు కూడా మలినరహితములై పోయినవి. తల్లీ! ఆనాటివిశ్వాస మేమూల కొరిగినదీ.. ఆనాటి పవిత్ర ప్రమాణములు యేజల రాసిలో కలసిపోయినవీ, అయ్యొయ్యో మము గన్నతల్లీ! నీకీ వెగటుమంను యేవిశ్వాస హీనులిడిరో కదా.

ఉమా—నీపాఠము చాలును.

గంగా—అష్టకష్టములనుజెంది యార్జించుకొనిన జండా కు మాకు ఋణము తీరిపోయినది, కడకు పెంచి పెద్ద వారినిగా జేసిన మీకు మాకుకూడా ఋణము తీరిపోయినవి. గౌరీనాధుడు బహిష్కరింతు మనుటచే మేము అంటరాని వారమైపోయినాము.

ప్రసా—ఇక శాంతిలేదు. సుఖముకూడా లేదు. చెప్పి ననూ చెప్పకపోయిననూ ఫలము మిథ్యయైపోయినది... చెట్టు చెడుకాలమునకు కుక్కమూతి పిందియలు పుట్టినట్లు వీరి వంకరటింకర బుద్ధులు పుట్టినవి. గనుక యనుభవింపకతప్పదు. అసహనపాలకుల హూంకార యహంకార ఘీంకారములు మిన్నుముట్టుచున్నవి. అప్పుడే ప్రతికక్షుల ప్రచారములు వీధి

వీధులలో సాగిపోవుచున్నవి. ఇరుగుపొరుగు గ్రామాదులవలె మనగ్రామదేవి స్వాతంత్ర్య విభూతీసారమును జూరుకొన లేక బిక్కమొగముతో యిక్కిరిబిక్కిరి లాశిపోవుచున్నది. రాజ్యం పద్మా; ఈ వుప్పెనగాలికి గ్రామస్థుల కుటీరములు యేగతివికావికలైపోవునోకదా! మన మేమికావుంటిమోకదా! శలవు. మాపై దయమాలిన వో మాతల్లీ శలవు.

రాజ్యం—మాకూ మా మాతృశ్రీకినీ యెడబాటులను గలిగించిన వో స్వార్థవ్యర్థ ప్రజాప్రభుత్వద్రోహులారా! శలవు...

ప్రసా—పదవీవ్యామోహ మహాభూతములకు మమ్మూరూహుతిగా యిాయజూచుచున్న రాక్షసిస్థాంతీయులారా! శలవు... (నిష్క్రమించును)

ఎల్లరు—జై! గంగాధరునకూ జై! గంగాధరునిపార్టీకి జై!

కాంతం—ఉమాదేవిగారికీ జై!...

శ్రీధరుడు—(ప్రవేశించి) కనకయ్యకూ జై! కాదు! కాదు! కాంతయ్యకూ జై!...

గంగా—వీరెవరూ...?

కాంతం—ఇంకెవరూ? లోగడ మనకడ కొచ్చిన గూఢచారి మహాశయులంగారే.

ఉమా—(కోపముతో) ఈతడు గూఢచారియా.. ?

కాంతం—ఔను...

శ్రీధ—కాదు...కవిని...గాయకుండను, కనకయ్యలా గంటి వారికిక బంధుడనుకూడా.

ఉమా—కనకయ్య గాడెవడూ...?

శ్రీధ—కాంతయ్యగారిని అడిగితే పిదప మీకు వివరముగా తెలుపగలడు.

గణ—ఎవడైతే మాకేమిగాని మరల నీవిచ్చటి కేల వచ్చితివీ?

శ్రీధ—ఆశ్రమములో చేరుటకు దయతో దీనిని గ్రహించుడు (అని వుత్తర మిడును).

ఉమా—(చూచి చించిపారవేయుచు) నీ నాటకమర్థమైనది పొమ్ము. నీదిక్కున్నవారికి పోయి చెప్పకోనుము, (అని గద్దింపగా శ్రీధరుడు నిరుత్తరుడై నిష్క్రమించుచుండును. ఎల్లరూ వికటముగా నవ్వుదురు.)

తె ర వ్రా లు ను.

*

## 7

# కాంగ్రెస్ కార్యాలయము

(గౌరీనాథుడు, శేఖరం, గిరిధర్, పద్మనాభం, చంద్రం వగైరా ప్రముఖ గ్రామ కాంగ్రెస్ నాయకులు ఆసీనులై యుండగా తెర లేచును)

గౌరి—సుచరిత్రులారా! సహజన్ములారా!

చ॥ జరిగిన దానినే తలచుచసాగుట ధర్మముగాదు శిష్యులే
యరిగిరి మేలుకూర్చ హృదయంబులు గల్గినవారలైనచో
తిరిగి యథాతథంబుగను దీవన లిత్తురు కక్షవీడి గ్రా
చరఖ కులంపువారలకు సర్వసుపర్వులుకూడ మెచ్చగాన్.

శేఖరం—సామాన్యముగా వారు తిరిగి యథాతథంబుగా మారరనియే నాయభిప్రాయము.

చంద్ర—ఒకవేళ వారు మారదలచిననూ రాహు కేతువులవలె పొంచియున్న గణపతి శ్రీపతులు వారిని మారనీయరు.

గౌరి—దానికి మనమేమి చేయగలము.

గిరి—చాల బలిష్ఠమైన పార్టీయగును గనుక భయపడుచుంటిమి.

గౌరి—కాంగ్రెస్ సంస్థకే భయముకలదుగా!

శేఖ—కారణములు కలవు గనుకనే భయపడు చున్నాము.

చ॥ గణపతిమిల్లులో మనదు గ్రామనివాసులు పెక్కుమంది జీ
వనముల జేయుచుండె మనవారికి వారలు వోటులిచ్చితే
పనులకు స్వస్తిమంగళము పాడకతప్పనె గౌరినాథ సా
ధన కనుపింపరాదు సయితానుల గెల్చుట యెట్టులోకదా!

గౌరి—మిల్లుయజమానుల బెదరింపులకు బెదరుకొను ప్రజ లీనాడు నూటికి యిరువురుకూడా లేరు గనుక యట్టి భయమును విడువుము.

శేఖ—అదియునూకాక నో ప్రజా మనోరంజకా!

ఉ॥ శ్రీపతికే సహాయపడ సిద్ధమునైన గురూత్తముండు యీ
కోపును కాయగాతగిన కోవిదులెవ్వరు గౌరినాథ, యీ
దీపములన్ని దీరవరుదీప్తికి రద్దయిపోవె కాని మా
లోపము లుంచకుండ క్రియలోలురమై చరియింతు

మెంతయున్

ఇక యమాదేవిగారితో పోటీనిచేయగల సాధ్వీమణు లేరీ...?

ఉ॥ తాళిగలట్టి స్త్రీలు గడిదాటరు యీయమ కన్నులిప్పితే
హాళిక శ్రేష్ఠులంత జయహారతు లిత్తురు చేయిచాపితే
మూలనుదాగు వృద్ధులును ముద్దియలెల్లరుగూడ వోటులన్
మేలుగనిచ్చి మెచ్చెదరు మేదిని యీమెనుగెల్వ శక్యమే!

చంద్రం—వారికి చాలిన మహారధులూ, అతిరధులూ, సమరధులూ మనలో లేకపోలేదు. ఉన్నారు.

చ॥ మనదు ప్రసాదునిన్ గెలచు మానధనుండు గురుండు
దక్ష యా
ఘనులలో లేనలేదు, నడిఁట్టును శేఖరు దేబిగించినన్
వణకక పోరువైరులు సవర్ణులతో సహారాజ్య లక్ష్మికిన్
పణితులు జేసితీరుదురు పట్టగశక్యమె పద్మనాభునిన్

గురు—ఇక నీ ఇద్దీసింహ్వాని ప్రతిభ యేలినవారికి దెలుపకయే తెలుసుకొనగలరు.

శేఖరం—అడిగో ఖిన్నవదనుండై మన ప్రసాదబాబు రానేవచ్చుచున్నాడు...

పద్మ—రాజ్యంకూడా వచ్చుచున్నది...

(ప్రసాదుడూ, రాజ్యంగారలు ప్రవేశించి నిర్వీర్యులై నిలచిపోవుదురు)

గౌరీ—(చూచి) పలుకవేమి ప్రసాద్! ఏమి జరిగినది.

ప్రసా—జరుగవలసినది జరుగలేదు...

రాజ్యం—కలహముమాత్రము కలిగినది.

గౌరీ—జాలికలుగలేదా...?

శేఖ—ఎందుకు కలుగుతుందీ...?

ప్రసా—గౌరీనాథ్!

ఉ॥ నాకు కుటుంబము గావున విశంకల రంధుఃఖాదిన్ బలంచి నే
వేసవ క్షామునే వెడలి వేశిరి వేంబదిగాంబులన్ వినే
పాకము శోనలేదు యిక భార్యయు వేడిన దాతకన్న,యీ
లోకము గానలేదు ధనలోలుడనైతి వచింపలేనికన్.

గౌరీ—గంగాధరునిహృదయకుహరములో ధనకాంతా మహాభూతములు వాసముచేయుచున్నవి.

శేఖ—పదవీ వ్యామోహాభూతరాజములుకూడా.

గౌరీ—కనుకనే మనకు దూరగ్రస్తులైనారు.

రాజ్యం—కడకు క్షేమము వైనోలగి సభ్యతాపదవులను తమకు సత్కరింపచేయను మనినారుకూడా.

గౌరీ—దానికినీ యంగీకరింపరైరిగా...

రాజ్యం—ఇచ్చునది ప్రజలుకాని తమరు కాదనినారు.

ప్రసా—అంతియేగాక ధనకాంక్షనుకూడ బలిహరణ మీయగలమనినాము.

శేఖ—దానికిని సుముఖతగా చూడలేదా?

ప్రసా—లేదు. మిగుల తీక్షణముగ చూచినారు...

రాజ్యం—మిగతావారు కడుచులకనగా చూచినారు కూడాను...

గౌరి—మంచిది, ఇక మనముకూడా తగినవైఖరిగనే సారచూడగలము, సోదరులారా! వారు కాంగ్రెసునుండి విడిపోయిరనియూ, కాంగ్రెస్ సిద్ధాంతమునకు వారు ప్రబలవిరుద్ధ

ముగా సంచరింపుచున్నారనియూ, శీఘ్రమే పోయి ప్రచార మును కొనసాగింపుడు, సర్వమానవ ప్రపంచానీకములో శాంతియుత పోరాటమును సలిపి స్వాతంత్ర్యభిక్ష నొసంగిన కాంగ్రెస్ మహాసంస్థకు వోటు యీయనినాడు దుర్భిక్ష ఘోర పాతక పదవీవ్యామోహాగ్నిలో పడిపోగలరని ప్రజలకు మనవిచేయుడు. నేటిదనుక విపరీత విపత్సముద్రముల నెన్నింటి నో నిర్గమించి యనర్గళ నీతి నియమాదుల నతిక్రమింపక పాలింపుచున్న సంస్థకు వోటులేయనినాడు అసహాన పాలకుల తీవ్ర తీర్మాన ఫర్మానాలకు హేతులైపోగలరనికూడా ప్రక టింపుడు.

ప్రసా—(వణకుచూ) వలదు. వలదు, వేగిరపడవలదు, వారివలె మనమూ త్వరపడకూడదు. వారినే యాక్రమింప జేసికొనసీయుడు. అశాశ్వితమైన పదవీవ్యామోహ| వారాసి లో వారినే దుమకనీయుడు...తండ్రీ! మీరైనా కనికరమును చూపుడు. నాయీ గ్రామదేవిని పార్టీ మహామ్మారికి బలి యీయకుడు.

శేఖ—సంస్థకు చీలికలు కలుగునని స్వార్థపూరిత మానవాధములకు పంచాయతీ ప్రజా పరిపాలనమును గట్టి పెట్టుట ధర్మమా ప్రసాద్!

రాజ్యం—శేఖర్! పొరపడుచుంటివి. క్రితము ఆ మహనీయ తేజులు కూడా ప్రజల మానసవీధులలో జ్యోతులను వెలిగించి నివారించినవారే. ఉభయులుకూడా ప్రజల యోగ

క్షేమాదులకై తను మన ధనములను ధారపోసినవారే! వారు కూడా దేశ స్వాతంత్ర్య మహాపోరాటములో హోరా హోరి పోరాడి కీర్తిని గణించుకొనినవారే. గ్రామ పరిపాలనా శీతములపై కూర్చొనుట కర్హత కలవారేగాని యర్హతలేని వారని తలంచుట పొరపాటు గాన నో మహాశయులారా! పోటి చేయకుండు టే శ్రేయస్కరము.

చంద్రి—మనమటు లనుసరించినచో చేతులమీదుగా ప్రజాద్రోహమును చేసితిమని విదితము గాకపోవదు

గారి—వీలు లేదు. ఏమాత్రముకూడా వారికివీలు లేదు.

ఉ॥ సహనము లేని స్వాములను, సభ్యుల జేయస్వతంత్ర
బీజముల్

దహనముచేయ రే రుధిర దాహముగ్రోలరె పైగమిత్రమా!
తహతహలాడ రే ప్రజలు దక్కిన శాంతియు సద్యశాదులా
గహనము పాలుగాదె శునకాలకు పాలనగట్టవచ్చునే!

గనుక యేమాత్రముకూడా వీలు లేదు...

ప్రసా—లేదా స్వామీ! గ్రామము స్వార్థపూరిత భూకంపములతో కంపింపబడిపోవలసినదేనా? నా యీ క్షేత్ర పాలని సంకట, సందిగ్ధ, సంక్షోభ, సంతాపాగ్నులలో దహింపబడిపోవలసినదేనా; స్వామినాథ్; భయము! మహాభయము! వినుటకే నాకు మహాభయమగుచున్నది...

గారి—జయాపజయంబులు దైవాధీనంబులు. మన కర్తవ్యములను మనము గమనించి యాచరించుట విధియై

యున్నది. గనుక విజయభేరీని మ్రోగింపుడు. ఎన్నికలు జరిపింపుడు. ఇది అంతిమనిర్ణయము.

(ఎల్లరు జేజేలు... తెం ద్రాలును)

*

7

వీధి

(శ్రీధరుడు విచారముతో పాడుతూ ప్రవేశించును.)

పాట.

కటకటా ఎంతఘోర మెంతఘోరము

ఉ॥ గ్రామపురోభివృద్ధికయి కంకణముల్ ధరియించ కోర్కె సు
స్వాములటుంగా ప్రజలు స్వార్థపరాయణులైనవారి కే
ప్రేముకి వోటులిచ్చిరిట భేదమెఱుంగక; రామ; రామ; యే
ధూమములుద్భవించి యికఘోళిని చేయునో తీరవాసులన్.

గురు— శివ శివా! ఇక జీవించుట దుస్తరము.

శ్రీధ— ఎవరు గురునాథం.

గురు— ఇక నీయిడ్లీసింహాల్లు జీవించుట కడు దుస్తరము.

శ్రీధ— ఎందువలనా?

గురు—కాంగ్రెస్ తరఫున వాక్కు ప్రసాదబాబుదక్క మిగతావారంతా కాంగ్రెసేతరులే గ్రామపంచాయతీ పాలకులుగా వచ్చుటచేత.

శ్రీధ—అదికాదోయ్! భైరవుడా! అసలు విషయమే మాటో సరిగా చెప్పుము.

గురు—కాఫీహోటలు గణేశయ్యగారు యిడ్లెనులను రేషన్ ప్రకారము వాడుకొనుడనియూ, అట్లు ప్రజాప్రభుత్వ శాసనము రేపో మాపో వెలువడగలదనియూ, ఇడ్లీ పిండప్పాలు ముందుగనే మేలుకొనవలయుననియూ, నాతో యతిరహస్యముగా నుడివినాడు. గనుక యిడ్లెనులను విలువ జేచుకొనక పోయినచో నేనూ నా వారసులమూ జీవించుట మహా కష్టతరము.

శ్రీధ—నీ మాటలకేమిగాని గురునాధం! మొత్తము మీద గణపతి శ్రీపతులు యెన్నికలలో గెలచుటవలన ప్రజలకు హానికలుగక మానదు.

గురు—నిజమే! నా మాటకేమిగాని యిక నా వారసులైన యగ్నిదగ్ధులూ, అనగ్నిదగ్ధులూ, అయంపిండులూ అల్లాడి ఆకులుమేసి పోగలరు.

శ్రీధ—అగ్నిదగ్ధులెవరూ? అనగ్నిదగ్ధులెవరూ? అయంపిండులెవరు?

గురు—అగ్నిదగ్ధులనినచో చుట్టూ, బీడీ, సిగరెట్టూ, గంజాయీలను త్రాగువారు.

శ్రీధ—శేష్! ఇక యనగ్నిదగ్ధులో?

గురు—నశ్యమును పీల్చువారు.

శ్రీధ—ఇక అయాంపిండులూ?

గురు—నల్లమందు వుండలను దిగమ్రింగువారు. ఈ మూడుతరగతుల వారలుకూడా మహాయుల్లాడి ఆకులుమేసి పోగలుగుదురు.

శ్రీధ—ఎందువలనా?

గురు—ఛండశాసనులు పాలకులుగా వచ్చుటవలన,

శ్రీధ—వారివలన యింతలో నేమి వుపద్రవమూవ హిల్లినదీ;

గురు—పరిమిషన్ లేనిదే రేషనుకు మించి చుట్టాబీడి సిగరెట్టులను త్రాగకూడదుట.

శ్రీధ—మంచిదేగా! (అని నస్యమునుపీల్చును.)

గురు—పన్నును చెల్లించి లైసన్సును పొందనిదే నస్యమును క్షణక్షణానికీ పీల్చుకొనరాదుట,

శ్రీధ—అది అంతకన్నా మంచిదేగా.

గురు—ఉత్తరువు లేనిదే నల్లమందు వుండలను దిగమ్రింగరాదుట.

శ్రీధ—ఎవరు చెప్పిరీ.

గురు—రేవనుప్రకారము పంపునీటినిపట్టుకొనుచున్న స్త్రీలు చెప్పుకొనిరి;

శ్రీధ—ఎవరితో...

గురు—ఈ యిడ్లీ సింహస్వామితో, ఈ కాఫీహోలుతో.

శ్రీధ—నీతో చెప్పకొను టెందులకూ...?

గురు—వకాల్తాను పుచ్చుకొని యిటు కాఫీహోలుర తరఫునా అటు అగ్ని దగ్ధులూ, అనగ్నిదగ్ధులూ, అయుంపిండుల తరఫునా, నడుమ పంపునీటిని పట్టు స్త్రీల తరఫునా పోయి పంచాయితీ ప్రజాప్రభుత్వమువారితో వలదని వాదింపమని .. ఇక కవుల తరఫున మీరుకూడాపోయి లేమను ప్రకారము, పంచాయితీ ప్రజాప్రభుత్వ యుగములో కూడా కవనమును వ్రాయ లేము మహాప్రభోయని మనవిచేసుకొనుడు.

శ్రీధ—పోయి మనవిచేసుకొనుటకు నీవలె నాకు తోకలు లేవుగా...?

గురు—మంచిరోజు చూచి సొంత ఖర్చుతో మీరు కూడా తొడగించుకొనుడు.

శ్రీధ—గాజులా !

గురు—ఔను...(ఎగురుతూ) కుక్కలే శునకాలు, కుండలే భాండాలు, చిలుకా రామచిలుకా ! తోకలే బిరుదములు గాజులే కంకణములు మెలుకా చిట్టి మెలుకా

శ్రీధ—అవి నా కెందుకులే గురునాధం ! పోయిరా !

గురు—చిత్తం ! పోతున్నాగాని కవీజీ ! ఇంచుక దీవించనైనా దీవించండి.

శ్రీధ—జై ! ఇడ్లీ సింహాసనకూ జై...

※

# 8

# పంచాయతీ పాలక భవనము

[శ్రీపతి, గణపతి, ఉమా, గంగాధర, ప్రసాదరావు గారలు పంచాయతీ పాలకసభాపీటములపై యాసీనులై యుందురు. నృత్యగీత, గానానంతరం.]

ప్రసా—ప్రజానీకముచే నెన్నుకోనబడినవారము గాన మనము ప్రజామనోరంజకరమగు తీర్మానములనుమాత్రమే ప్రవేసింప జేయవలయును.

శ్రీప—మేము చదువుటకు రాలేదు...

గణ—ఇయ్యది పంచాయతీ సభగాని చదువులబడి కాదు...

ప్రసా...సమగ్రదృష్టితో వ్యవహరింపవలయును.

ఉమా—అదిగో మరల నీతిపాఠములను చదువుచుంటివి.

ప్రసా—క్షమించుడు.

శ్రీప—క్షమించుటకు మాకు క్షమాకవచములు లేవు.

శేఖర—(ప్రవేశించి) గ్రామపంచాయతీ ప్రభుత్వ

పాలకులకు ప్రజలతరఫున మనవిని చేసుకొనుచున్నాను...

గణ—మనవిచేసుకొనుటయేగాని, ఫలమో పత్రమో కడకే ఛత్రమునో దాఖలుచేసుకొనిన పాపమునపో లేదుకదా ఏమని నీమనవి...

శేఖరం—పరిసర గ్రామాదులకూ, పల్లియలకుకూడ వరదలవలననూ, తుపానులవల్లనూ పెక్కువిధములైన నష్టములు సంభవించి బాధ లనుభవింపుచుండిరి.

శ్రీప—గాధలు చేసుకొనుట లేదుకదా...

శేఖ—లేదుగనుక పన్నులనుతగ్గించి రైతులోకమును వుద్ధరింపవలసినదిగా నూ మనవి.

శ్రీప—మీ మనవి యసమంజసమైనదని పాలకుల తరఫున మహామనవిచేసుకొనుచున్నాను. ప్రభుత్వమునకుగూడ సదరునష్టములువాటిల్లి యున్నని. ప్రభుత్వపుయధీనమునవుండు వంతెనలు, బిల్లింగులూ, విద్యుద్దీపములు, తంతీస్థంభములు, ఇంకా యనేకములైనవి దెబ్బతినిపోయినవి. గనుక యా నష్టమునుగూడ ప్రజలు భరింపవలసినదియే కాబట్టి పన్నులను నూటికి పాతికవంతున పెంపకము చేయవలసియుండునను నా తీరుమానమును యేకగ్రీవముగా యంగీకరించి పంచాయతీ ప్రజాప్రభుత్వమును బలపరుతురుగాక!

గణ—ముఖ్యముగా నేను బలపరుపుచుంటిని.

ఉమా—నేనుకూడ సమ్మతించితిని.

ప్రసా—ప్రజలకు మనయం దభిమానము నశింపగలదు. గనుక నేను సమ్మతించను.

గంగా—శ్రీపతిగారి తీర్మాన మామోదింపబడినదని పంచయతీసభాధ్యక్షు పీఠమునుండి నేను తెలియజేయుచున్నాను.

ప్రసా—నా వ్యతిరేకతనుగూడ వ్రాయించుడు.

గణ—ఇక రైతునాయకాగ్రేసరా! దయచేయవచ్చును.

శేఖ—మీరు ప్రజలకుచూపిన సానుభూతిని జగద్విదితము జేయుటకు దయచేయుచున్నాను.

(నిష్క్రమించును.)

చంద్రి—ప్రజలతరభున నాదొకమనవి.

గణ—ఇక మీమనవినికూడా కానీయండి.

చంద్ర—తుపానుభీభత్సతవలన మిల్లుపనివారల పాకలు కూలిపోయినవి గనుక రెండు మూడు నెలల జీతములను ముందుగా యజమానులు యిచ్చునటుల ప్రభుత్వ శాసనమును వెంటనే జారీచేయించి శ్రామికజీవుల శ్రేయస్సుకై తాము కృషిచేయవలయునని ప్రార్థింపుచున్నాను.

గణ—అదియసమంజసము, అసంభవముకూడా. మిల్లులన్నియూ సదరు తుపాను వరదలకే గురియై యపరిమిత నష్టమును యనుభవించినవి. గనుక యుత్పత్తిలో నూటికి. యధమపక్షము యేపదివంతులైననూ పెంచుట కవకాశము.

గల తీర్మానమును సత్వరమే ప్రవేశపెట్ట గలందులకు నేను మహామహా మనవులను మరీమరీ చేసుకొనుచున్నాను.

శ్రీప—అందుల కభినందించుచున్నాను.

ఉమా—మిల్లులు సాగనిచో షావుకారులూ, సామాన్యులుకూడ దెబ్బతినగలరు. గనుక నేనుకూడా గణపతి ప్రవేశపెట్టిన తీర్మానమును బలపరచుచున్నాను.

ప్రసా—వలదు ఆ తీర్మానమును బలపరుపవలదు.

శ్రీప—రూలుప్రకారము బలపరచి తీరవలయును.

గణ—వోటింగుయుంచనా) ప్రకారమునైనా బలపరచి తీరవలయును.

ప్రసా—ప్రధాన పంచాయతీపాలకాగ్రణీ!

ఉ॥ ఇప్పటికే ధరల్ పెరిగి యీ మన గ్రామనివాసు లక్కటా
తిప్పలు జెందుచుండ గురుతింపగ లేక మహామహోత్తముల్
దప్పికయంచు ద్రావకము తాపగజూచుట ధర్మమానె, మీ
గొప్పకు హానిరాదె జనకోటికి హాయిని గూర్పకున్నచో.

గంగా—కలము వణంకుచున్నదియో లేక నాయీ కరమే వణంకుచున్నదియో కదా!

గణ—వణకవలసిన పనిలేదు. విధిగా యీ తీర్మానమును యామోదింపబడినట్లు వ్రాయుంపుడు.

గంగా—సరియే.

ప్రసా—నా వ్యతిరేకతనుకూడా నమోదుచేయింపుడు.

శ్రీప—కార్మికనాయకా! ఇక నీవుకూడా సాగ వచ్చును.

చంద్రి—ఈ గ్రామపంచాయతీప్రభుత్వము వారి పరిపాలనావిధానమును పూర్తపూరా చాటుటకు యెందుకు నాగనూ!

రాజ్యం ప్రవేశించి—స్త్రీలతరఫున నావిన్నపములు.

ఉమా—ఉన్న పనులన్నీ మీవిన్నపములతో నాశనమగుచున్నవి. త్వరలో తెమలుచుము.

రాజ్యం—చిత్తం! స్త్రీలకు ప్రత్యేక గృహశిక్షశాల కావలయునని

గణ—స్త్రీలకు ప్రత్యేకతగా బజారులుకూడా బనాయించవలయునా!

శ్రీప—వీలు లేదు. తమరిక యరుగవచ్చును.

రాజ్యం—గంగాధరంగారూ! మీ భావనకూడా వీలు లేదనియేనా?

ఉమా—మా నలుగురి భావములూ యింకా విభాగములు కాలేదు.

రాజ్యం—శలవు...(నిష్క్రమించును)

గిరి—నాదొక విన్నపము.

గణ—కానివ్వండి స్వామీ యిక కాలహరణమేలా!

గిరి—కనకయ్య కాంతయ్యగా మారినాడనియూ, మన గ్రామ కాపుకస్తుడు కాడనియూ, పరాయివచ్చిన దొంగనీడని యూ, ప్రజలు గుర్తించిరి. ఇక పోలీసులుకూడ గుర్తించి గ్రామశాంతిభద్రతలను కాపాడగలరని ఆశిస్తున్నాను.

శ్రీధ—అది మన కనవసరమని శాసిస్తున్నారు. వారి తాలూకు గ్రామపంచాయతీప్రభుత్వ ఫర్మానాలు జారీచేయ బడినప్పుడు చూచుకొనగలము.

ప్రసా—వాని దినచర్యలను రహస్యపరిశోధకులవలన మొందులకు తెలుసుకొనకూడదూ?

శ్రీపతి—అటువంటి పనికిమాలిన యన్వేషణమునకు ప్రజా ప్రభుత్వ మొన్నందునూ తావు యీయదు. గనుక ఇంక తమ రరుగవచ్చును.

గిరి—అగ్నివీణియలశగను తాళలేకనే పోవు చున్నాను.

(నిష్క్రమించును).

లక్ష్మీం—(ప్రవేశించి) ప్రభుత్వమువారికి కంట్రాక్టరుల తరఫున మనవి...

శ్రీపతి—వినుటకు మిక్కిలికుతూహలముగానున్నాము.

లక్ష్మ—వరదలవలననూ, గాలివానలవలననూ, క్రొత్త కడుతున్న ప్రభుత్వ భవనములూ, వంతెనె వగైరాలు వ్యర్థ ములై పోయినవి. పైగా వలసిన పనిముట్లన్నింటినీ తిరిగి చీకటి

వ్యాపారకులకడ కొనవలసివచ్చినది. గనుక ఒండరుపైనూటికి పదిహేనువంతులు యెక్కువగా యిప్పించవలసినదని కోరుతున్నాము.

ప్రసా—ప్రస్తుతము ప్రభుత్వ బొక్కసములో నిలువ లేదని ఆర్థిక శాఖాధికారులగు తమరే చెప్పియుంటిరి. గనుక వీలులేదని నాగర్జన...

శ్రీపతి—అట్లు ప్రభుత్వ మీయనిచో క్రుంగిపోవుదుమని కంట్రాక్టరులు గొడవచేయగలరు; గనుక వారుకూడ మన ప్రజాకోటిలోని వారలే గనుక గ్రాంటు చేయవలయునని నా భర్జన.

ఉమా—కంట్రాక్టరులు నష్టపడినచో యికముందెవరూ కంట్రాక్టు చేయుటకు భయపడి కలసిరారు గనుక మంజూరు చేయుటయే సమంజసమని నాప్రార్థన.

ప్రసా—ఒకడు నష్టపడగూడదని ప్రజాపాలకులు ప్రజల సొత్తును వానికి విరివిగా కట్టబెట్టి ప్రజలనందరినీ నష్టపెట్టుట ప్రజారాజ్య నీతి నియమావళికి భంగకరముకాదా మహాశయా!

గంగా—కంట్రాక్టరులు కోరినంత యిచ్చుటకు వీలు లేదు కాని మొత్తముమీద కొలదిగానైనా ప్రభుత్వము వారు ఈయకున్నచో మహాదారుణములకు గురియైనష్టపడిపోగలరు. గనుక నూటికి రైయిదువంతులు ఒండరు పైపెచ్చు యిచ్చుటకు సమ్మతింపవచ్చును.

ఎల్లరూ—(చప్పట్లు కొట్టుదురు).

ప్రసా—అన్యాయము అది కేవలమన్యాయము. ఇది ప్రజారాజ్యముకాదు. రాక్షస రాజ్యము. ప్రజలను యింతటి దీనదశకు, లోనుగా జేయుచున్న మీపరిపాలనా విధానమునకు కేంద్రపాలకులు సంతసింపబోరు. దేవతలు మన్నింపబోరు. దేశీయులు సుదర్శన చక్రాయుధమును మీపై ప్రయోగింపక పోరు. ఇక మీ దారుణ తీర్మానాగ్నిని యార్పక సహింప లేను. శాంతి వహింపలేను.

శ్రీపతి—సహింప లేనిచో రాజీనామాను దా ఖ లు చేయుము.

ప్రసా—మీ చేత ప్రజలు రాజీనామాలను దాఖలు చేయించియే తీరగలరు.

గణ—నీవు కూడ మాతో నేకీవించినచో మావలె బాగుపడగలవు.

ప్రసా—ప్రజలసొత్తును కాజేసి మీవలె నేను బాగు పడ లేను.

శ్రీపతి—గుడి గోపురాదులకు ధర్మకర్తలము గనుక అవసరమైనయెడల దేవునిసొత్తునుకూడా యపహరింపగలము. దానికి నీవేమి చేయుగలుగుదువు ప్రసాద్!

ప్రసా—మీకు హృదయము లేదా? ఇంతటి దారుణమా సమభావము లేనిసభ్యులు ప్రజాభ్యుదయమునుగోరని సభ్యులు, సమానము లేని సభ్యులు నిలచిన ఈ పవిత్రప్రదేశము

పాపభూయిష్ఠమైపోయినది. ఈ పీఠములు పంచమహాపాపముల కాలవాలములై పోయినవి. ద్వేషమయములైపోయినవి. క్షుద్ర వ్యామోహపాలకుల వశమైపోయినవి... ఓ పదవీ వ్యామోహనరాంతక దేవాంతకులారా! ఇకనైనా క్షాళనము చేయుడు, ఇకనైనా కుతంత్రములకు తెరతీయకుడు. ఇప్పటికైనా సకలవిధ ప్రజానీకానితో యేకీభవించి ధర్మబద్ధముగా పాలించుకొనుడు. అన్యాయకులైన ప్రజలను క్షామపీడితులైన ప్రజలను అభిమానధనులైన ప్రజలను, మ్రింగకుడు, నిర్దాక్షిణ్యతగా మ్రింగకుడు, నాపై వైరమున్న నన్ను మింగుడు. కాని నా యనంగు సహోదర సహోదరీమణులనుమాత్రము మ్రింగకుడు, తదితర గ్రామాదులలో ప్రజలచే నెన్నుకొనబడిన సభ్యులు కీర్తిని కాపాడుకొనుచూ యేరకముగా పాలింపజాలగలుగుచుండిరో కన్ను విప్పి వొక్కసారి పారచూడుడు.

శ్రీపతి—మేముమాత్రము ప్రజలము కామా! మావలన సహాయములను బడయువారందరూ ప్రజలు కారా! గురుదేవ్ కన్నులు చెమ్మగిలుచున్న వెందులకూ...?

గంగా—నేను రాయినైపోనందులకు కటకికొయ్యనై పోనందులకు.

ఉమా—మీరు త్రిప్పాకటుల తిరుగు తిరగండ్లమై పోయినందులకు.

శ్రీప—గురుదేవ్! రాజకీయ వ్యవహారములు నిలకడ మీదకాని సుఖకరములైపోవు గనుక శాంతివహింపుడు.

గణ—వీని మెఱుములకూ వుఱుములకూ మనము చెఱువులమై పోగూడదు.

ప్రసా—గురుదేవ్! నిజముగా నీవు నా గురుపుంగవుడవేనా? విద్యాబుద్ధులు గఱపిన గురూత్తముడవేనా? ఐనచో నాటి వాత్సల్యమేదీ? ఆ నిష్కళంక ప్రేమమేదీ? కావు నీవు నా గురుమహాదేవుడవు కావు. మోసగురుడవు. మోహగురుడవు. మోక్షవిరుద్ధుల స్వాహాకారులపాలిటి గురుండవు గాని నా గురుడవుకావు. నాపాలిటి గురునాధుడ వైనచో యీ న్యాయాధనకుంభసంభవులతో కలిసి ప్రజావిరుద్ధ మహా ఘోర నికుంభినీ హోమమును చేయబూనుదువా? కనులతో చూడలేను. విలయములకు స్వాగతము లనుచున్న మీ ముఖములను చూడలేను. ప్రళయములను ప్రతిష్ఠింపనున్న మీ పాదంబులకు వందనములన లేము. కలహములను కదపుచున్న మీ కరచరణంబులకు యివే నా తిలోదకంబులు.

గణ—తెగబడిపోయినాడు.

శ్రీప—గత్యంతరము లేక రోసిపోయినాడు.

గణ—మూడు వత్సరములవఱకూ మనలను ముక్కంటి యీశుడుకూడా తేరి పారచూడలేడు. గనుక గంగాధరం గారూ భయవర్జితులు గాండి.

ప్రసా—మూడు వత్సరములవరకూ, మూర్ఖులనూ, స్వార్థులనూ, యీ ప్రజాపాలక పీఠములు మోయవలసినదేనా? ముప్పదియారు నెలల పర్యంతరమూ మీకు యీ ప్రజాపాల

నానుకూల, దివ్య భవన రాజములు స్వాగతము లీయుచుండ వలసినదేనా?

గణ—ఎవరికోసరం...

ప్రసా—ఈయలేవు ఈ భవనములూ, ఈ పీఠములూ మీకు స్వాగతము లీయలేవు. నీతి నియమాలకు దూర గ్రస్తులై మనుచున్నవో యసహాయగ్రామపాలకులారా! ప్రజా విరోధము పనికిరాను ధర్మచ్యుత పరాక్రమమునకు జోహారు లీయునవో పంచాయతీ ప్రజాప్రభుత్వపీఠాధిపతులారా! సెలవు.

(నిష్క్రమించును)

గణ—మంచిది. ఇక విశాఖపట్టణమునకు దయ చేయుము.

శ్రీపతి—నేటికి సభ ముగిసినది. (గణపతి, శ్రీపతులు నిష్క్రమింతురు.)

గంగా—అబ్బా! ఇప్పుడు నేను నిప్పులగుహలలోనిల చితిని ఉమా: నిలువ లేను...నిబ్బరింప లేను...ఏదీ నా యాశ్రమము, ఏదీ నా పాలిటి దీనజనులు ఎక్కడున్నదీ భగవద్గీత...నాచరఖాకూడ తోనుపంచుట లేదు. యేమైపోయినదీ!

ఉమా—పదవీవ్యామోహ మహాభూతము మింగి పోయినది.

గంగా—వలదు మనకీ పదవులువుమా! మనకీభవన ములుకూడా వలదు, మన కుటీరములను మనము విడువ

వలెను, ఆర్జించుకొనిన కీర్తిధనమును గంగలో విడువవలెను. పదవీవ్యామోహ మహాభూతమా మమ్ము మ్రింగవలదు. హా గాంధీదేవా! (అని మూర్ఛిల్లును.)

తెర వ్రాలును.

## 9

## కాంగ్రెస్ కార్యాలయము

(శ్రీధరుం పాడుచూ ప్రవేశించును. గురునాథం మొదటు గుండా ప్రవేశించి)

గురు—స్వామీ! ఇక యీ యూనియన్ కాపురము చేయలేరు.

శ్రీధ—ఎవరూ...?

గురు—నాబోటివారు అంటే తోకలు కలిగినవారు.

శ్రీధ—ఎందువలనా...?

గురు—కొనకొక టికూడ లేకుండా కోసుకొన పోవుట వలన.

శ్రీధ—అంటే తోకలను కోసుకొనిపోయినారా...?

గురు—కాదు పెరటిలోనున్న సారపిందియలను కోసుకొని పోయినారు.

శ్రీధ—ఆ కోసినవారెవరూ...?

గురు—ఇంకెవరూ! ఊటిగుంపు.

శ్రీధ—కాంతయ్యతాలూకు యీటిగుంపుయేనా...?

గురు—ఔను మహాశయా! ఆ యీటిగుంపుయే! వారి గుట్టును బట్టబయలు చేసితినని యింతపని చేసినారు.

శ్రీధ—కొంతిలో క్రొంతనయము. తోకలనుకోయలేదు.

గురు—వారి కడ్డమేమున్నదీ. పీకలనుకూడాకోయుదురు

శ్రీధ—పోయి గణపతి శ్రీపతులకు మనవి చేసుకొనక పోయితివా?

గురు—చేసుకొనినాను.

శ్రీధ—అందుల కేమనినారూ...?

గురు—తూర్పుకుతిరిగి యేడువమనినారు. అధికముగా వాగినచో మొదలంటనీతోకలను కోయుదుమనినారుకూడాను.

శ్రీధ—శివ! శివ!

గురు—అదిగో రైతులతరభున మనవిని చేసుకొనుటకు పోయిన శేఖరం గారుకూడా చేరుకొనుచున్నారు.

(శేఖరం విచారకరముగా ప్రవేసించును)

శ్రీధ—శేఖరంగారూ! రైతులోకమునకు విజయము కలిగినదా!

శేఖర్—కలిగినది మహాసంతాపము గలిగినది.

చంద్రదం ప్రవేసింపుచూ—శ్రమికజీవులను కష్టసాగరమున కూలద్రోయ నెంచిన క్రూర పాలకుల వలన మహా సంక్షోభముకూడా కలిగినది.

భాగ్య—(ప్రవేశించుచూ) స్త్రీగణమునకు వారిపై విరక్తిగూడా కలిగినది...

గిరి—నిరసించుమానవులకు దూరగ్రస్తులై పాలింపుమన్న పాలకులపై పరిపాలకులకుగూడా పగగలిగినది.

పద్మ—సడించి పగతీర్చుకొనుటకు. శ్రామికజీవులను కుపాసుల గా జేయుచున్న పాలితులకు బుద్ధిగఱపుటకు పదండి. రైతులోకమునకు సహకారము చేయలేని గ్రామపాలకుల దురహంకారము నిర్మూలింపజేయుగల సమర్థనీయులం తామమేకమై కదలండి. ధర్మవిలయము కలుగకుండా పోరాడుటకు బాలబాలికలుతో సహా బయలుదేరండి...

ప్రసాద్—(ప్రవేశించి) సోదరులారా! అశాంతికి త్రోవయీయకుడు. కాంగ్రెస్ సంస్థకు తలనొప్పిని గలుగ జేయకుడు.

గురు—ప్రసాదరావుగారూ! ఇక నోర్చుకొనలేము.

చంద్ర—శ్రామికులు కష్టసాగరమున కలసిపోవుచుండ సహింపలేము.

శేఖర్—రైతులోక మల్లకల్లోలమైపోవుచుండ ప్రతిఘటింపక నిర్వీర్యులమై యిక నిలువలేము...

ప్రసా—సోదరా! పాలితులకూ, పాలకులకూగల వాదవివాదములు శాంతియుతముగా పరిష్కరించుకొనవలయునే గాని అశాంతియుతులమై పరిష్కరించుకొనరాదు. అటుల నడచుకొనక దుష్టులలాగు దౌర్జన్యప్రేరిత భూతరాజములను

ప్రజలు యారాధించిననాడు మనసిద్ధాంతముయొక్క యౌన్న త్యమును మనమే రూపుమాపినవారమగుదుము.

శేఖర్ — ఊరుకొనినచో పాలితులకు బుద్ధివచ్చునా!

ప్రసా—కనుకనే శాంతిసమరమును సలుపవలయు ననుచుంటిని...

శేఖర్—రైతులు సిద్ధముగానున్నారు.

చంద్ర—అందుకు శ్రామికులుకూడా తయారుగా నున్నారు.

రాజ్యం—స్త్రీగణముకూడా కదలిరానున్నవి.

గిరి—ఆబాలగోపాలమూ తయారుగానున్నారు...

ప్రసా— సోదరులారా! అతిసహనముతో మనము శాంతిసమరము సలుపవలయును. వారు కఱ్ఱలతో మోదిననూ, బెత్తములతో బాదిననూ సరియే. కినుకవహించి దౌర్జన్యమునకు గురికారాదు. పాలకులు రాజీనామాలు దాఖలుచేయునంతవరకూ, నిరాహారులమై, నిరాయుధులమై బాపూజీ నామసుధారసమును గ్రోలుచూ పాలకుల భవనములచుట్టూ ప్రదక్షిణపూర్వకముగా పడియుండవలయును.

ఎల్లరూ—జై ప్రసాదునకూ జై!

తెర వ్రాలును.

## 10

# దీ న జ నా శ్ర మ ము

[గంగాధరుడు కృశీభూతచిత్తుడై మూలుగుచు సెజ్జపై పవళించియుండును. ఉమాదేవి దీనవదనురాలై తహతహ లాడుతూ నొకమూల కూరుచొనియుండును. శ్రీపతి, గణపతి, లక్షుంపతి, కాంతయ్యగారలు పరిక్కనకూరుచుందురు.]

గంగా—నిట్టూర్పుతో) ఈ గంగాధరుడు బాకుల పానుపుపై పవళించినాడా...?

గణ—కాదు. నవరత్న ఖచిత వినూత్నపసిడిమంచము పై పొరలాడుచున్నారు.

గంగా—అబ్బా! యిటు పొరలిన యిహ లోక యింద్రోపేంద్రుల బాకులూ; అటు పొరలిన దరిద్రనారాయ ణాఖ్యుల బాకులూ, ఎటు పొరలిననూ బాకులే—ఆ బాకు లకూ యీ బాకులకూ యాకలితీర్పజాల గలుగుదునావు చూ!

శ్రీపతి—తమల పాకులుగాని బాకులుగావు.

గణ—కాకలుతీరినవారికి బాకులు యేకులై పోగలవు.

గంగా—ఆ కలకల మేమిటిదీ.. ?

లక్షు—లోకుల కలకలము...

ఉమా—ఆ రోదనధ్వనులుకూడా ప్రజలవియేనా ?

కాంత—మొత్తముమీద ప్రజల రోధనధ్వనులే.

గంగా—అక్కా! పిల్లలేను, వృద్ధులుకూడా వాపోవు చున్నారు. వారిని యోదార్చువారు లేరా?

ఉమా—(చూచి) స్త్రీలు శిశువులు కూడా లాఠీల కెరనై పోవుచున్నారు. హా! హా! ఆ ఘోరదృశ్యమును చూడలేము. శ్రీ జగన్నివాస ప్రత్యక్షముగా వచ్చి భీభత్స ప్రళయ తాండవమును చేయుచుండ యీ యుగాన గంగాధరులు చూడజాలరు?

గంగా—అనాయకులైన ప్రజలను అహింసాయుత పోరాటంబును కొనసాగించుచున్న ప్రజలను లాఠీలతో మోద మనినది మీరేనా గణపతి! ఇంతటి మహాదారుణమును అల నాడు శ్వేతజాతీయు లేనియూ చేచేతుల చేయించియుండలేదు.

కాంత—ఇట్టి తరుణమున ధర్మ సందేహములతో కూరుచుండరాదు.

లక్ష్మం—దయా దాక్షిణ్యాదులకు తావుయీయరాదు.

గణ—పాపభీతిని చూపిన మహాలోకువైపోగలము.

శ్రీప—నయవినయములతో పాలనము చేయలేము. కనుక దండన చేయవలసినదియే.

గంగా—ఆగుడు (తెరలో యేడుపులు పెడబొబ్బలు వినపడును) మానవాకారములను దాల్చి మనుజులను హింసింపుచున్నవో రాక్షస రాహుకేతువులారా! ఆగుడు. మీకు మానవహృదయము లేదా? మీలో మానవత్వము నశించిపోయినదా? మానవీయులకారా? ఆదర్శ భారతీయ

సోదర సోదరీమణులకు [illegible] శిక్షణాస్త్ర [illegible]? మీరు సహజముగా మానవులు కారు. రాక్షసులు, కటిక రాక్షసులు. మీరు మానవజాతిలో పుట్టిన మహానీచులైనవారో నిరాహారు లైన ప్రజలపై [illegible] ప్రజల [illegible] [illegible] రాజీనామాదారుల [illegible] [illegible] రాక్షసులా [illegible] [illegible] లెత్తుజేసినారు మన చట్టములూ మన శాసనములూ మన ముక్కలుగా అణువులై, పరమాణువులమై ఘోరాతిఘోరమై పోవుచున్నవి. హద్దుమీరి తిరిగినారు నిలచుటకు చోటైను చోటుకూడా మనకు మిగులదు. మీ వలన దుష్కీర్తిని మూటగట్టుకొంటిని. మీ మూలమున కాంగ్రెస్ పతాకమునకు దూరమైతిని. తుదకు మీ మూలమున యీ రీతి కుములుచుంటిని. కుళ్ళుచుంటిని: ప్రజా క్షేమాభిలాషిణినైన నాయుమా దేవికి యా వేశమును కలిగించి పిదప నా మెడలు యిటివి పాపకూపమున కూలద్రోసిన వో రాక్షస పాలితులారా! రాజీనామాలను దాఖలు చేయుడు. ఇకనైననూ రాజీనామాలను దాఖలు చేయుడు. మన ప్రజలు దయామయులు గనుక క్షమింపగలరు.

ఉమా—ఇదిగో రాజీనామా ఫారముపై నేను సంతకమును కూడా చేసితిని.

(గణపతి శ్రీపతులు భయభ్రాంతులై రాజీనామాలను దాఖలు చేసి నిష్క్రమింతురు.)

గంగా—(త త్తరముతో) లాటీలతో మోదనున్న యీ రక్షక భటాధికారులను వలదని వారింపుము త్వరగా నా ప్రసాదుని నా యనుంగు శిష్యుని కనులకుచూపింపుము. ఈతుది ఘడియలలో నొక్కమారు నా కనులకు చూపింపుము. ఈదీన జనాశ్రమ పాలనాధికారమునుగూడ వాని భుజస్కంధములపై నిడి నిశ్చింతగా ప్రాణములను విడతును ఏదీ నా రాజ్యము రాజ్యం! రాజ్యం! నీవైనా పలుకవేమి రాజ్యం! అవినీతుడ ననియూ నీ సందేహము. రమ్ము నా యీ యవసానకాలము లో నొక్కమాట చెవిని వేయనిమ్ము. ఉమా! నాకేమో అయోమయముగానున్నది. ఆయాసము, ఈ పదవీవ్యామోహ మహాభూతము నాపీకెను నులిపివేయుచున్నది. హా! భయము. బాధ...హా గాంధీ దేవా.

(అని ప్రాణావశిష్టు డగును).

ప్రసాద్—గురుదేవ్! గురుదేవ్! (అని పరుగు పరుగున ప్రవేశించును).

ప్రసాద్—పలుకవేమి గురుదేవ్:

రాజ్యం—ఏమి జరిగినది తల్లీ!

ఉమా—మీ మెల్లరమూ రాజీనామాలనీయుటజరిగినది.

ప్రసా—నా గురుదేవుడు పలుకడేమి తల్లీ!

రాజ్యం—(చూచి) మూర్ఛ మునింగినాడా,!

ఉమా—(చూచి) నిర్ఘాంతపడి హా దైవమా! లోక గురుండు ప్రాణావశిష్టుడై పోయినాడు.

రాజ్యశ్రీ—అస్తమించితివా! దీనబాంధవా!

పరిసా—గురుదేవ్ !

సీ॥ పదవీ ప్రయోగాగ్ని బాంధవ్యులకు నీవు
భయపడి ప్రాణముల్ వదలినావ
గ్రామ విద్రోహుల ఘాతుక చర్యల
గనలేక విసుగుతో కదలినావ
ఆంధ్రుల దురవస్త లణగార వనియాంధ్ర
రత్నునితో జెప్ప రాలినావ
అమరపురాధీశు డాహ్వానమును పంప
యనుగు శిష్యుని వీడి యరిగినావ

తే॥ పాలనా భారమును మోయ జాలలేక
పరమ వైరాగ్యఖని వౌచు పండినావ
హంతకాధముల్ ఎవరైన హాని గూర్ప
అస్తమించితివా దేవ మాహుతిచ్చి...

రాజ్యం—విద్యాప్రదాతా! మీరు పడియున్నారని,

ఉ॥ దీనజనాశ్రమంబపుడె దీనతతో కళదప్పచుండె మీ
ప్రాణముదీతిగాచిగుణ్యప్రాయమునుంచియు పెంచు ధేనువుల్
దాణను ముట్టకొండ కనుధారలతో రోదసేయుచుండె నో
దీనజనావనా శోగతదీర్ప వదేలను తొంటివైఖరిన్

మా గురుపుంగవుని పొట్టను గొట్టుకొనిన శ్రీపతి

గణపతులారా! మీ కసులమంట తీరెనదా...?

ఉమా—రాజ్యా! మా గురుదేవుని బూడిదపాలుగా జేసినది పాపిష్టి గణపతి, శ్రీపతులే గాదు, యీ కన్యాశుల్కములు కూడా భాగస్వాములే. హా భాగ్యభరము ప్రసాద్! యేమి కారణము చిన్నప్పటినుండి నేను నన్ను శ్రీ నికేతనమును కూడా మా స్వాధీనముగా చేయుచుంటివి యేమి ... పవిత్రమతి ప్రజాపరిపాలనా భారమును వహించుచున్న వో పవిత్రమతి యువకులారా! విచారించకుడు. హా! దైవమా! (ప్రాణము విడుచును.)

రాజ్యం—అంధకారమున త్రోసిపోతివా నాయనా!

(అని మూర్ఛిల్లును.)

ప్రసాద్—గణపతి శ్రీపతులు నూరిపోసిన విషముచే గురుదేవుడస్తమించుటయే గాక గురుపత్నికూడా పరమపదించిపోయినది, హా జననీ జనకులారా! మమ్ములను దిక్కుమాలిన వారిగా జేసి దివికేగినారా!

తెరవాలును.



## 11

[వీధిని శ్రీధరుడు గురునాథంగారలు పాడుతూ ప్రవేశింతురు]

శ్రీధ—గురునాథం! గ్రామము కళ్యాణమయమై పోయినది.

గురు—ఎందువలనా...?

శ్రీధ—మన ప్రసాదుడూ, రాజ్యం! చంద్రం! గిరిధరుడు! శేఖరం వగైరా ప్రముఖులు పంచాయతీ ప్రజా ప్రభుత్వపాలకు లగుటవలన.

గురు—అంతేనా...?

శ్రీధ—అంతేగాక యింకా మీ యడ్లీసింహమ్మలూ, యిడ్లీ మార్తాండులూ, యిడ్లీ భీములూ, కాఫీలోటరూ తోకలను ఝూడించుకొనుచూ కూరుచొనక గ్రామ గ్రాస్త్రీ దళములలో చేరి ప్రజాసేవ జేయుచుండుటవలననుకూడా...

గురు—అందుచేత నేనా...!

శ్రీధ—అందుచేతనేగాదు...మీ సహచరులైన అగ్నిదగ్ధులూ, అనగ్నిదగ్ధులూ, అయంపిందులూ, సోమరిపోతులై కూరుచొనక వేతనారహిత పరిశోధకీయులై హాంతకులను ప్రజా ప్రభుత్వము వారికి వొప్పగింపుచుండుటచేత కూడాను.

గురు—అందుచేతనేగాని మీ ప్రచారక దళములవారి ప్రభావమువలన కాదన్నమాట.

శ్రీధ—అందుచేతకూడా...

గురు—ఏదుచేతనై తేనేమి. మొత్తముమీద మిగతా గ్రామములకన్నా మిన్నగా మన యీ గ్రామము ఘనీభవించిపోయినది.

శ్రీధ—గురునాథం! మనకాంగ్రెస్ నాయకులపరిపాలనా విధాన నైపుణ్యతలు వర్ణనాతీతముకదా!

చ॥ చక్కని చట్టముల్ తగినశాసనముల్ సవరించిసన్మహా
ఫక్కినిపాలనంబు పరిపాటిగ జేయుచు సద్యశంబులన్
దిక్కుల కంపినారు కడు దిగ్విజయంబుగ లోగడున్నయా
చిక్కులదీర్చినారు గుణశీలురు నూతనపాలకోత్తముల్.

గురు—ఈ యిడ్లీసింహాద్రులకూ, కాఫీలోలురకూ కూడా తగిన సౌకర్యములను గ్రామములలో కూడా కలుగ జేసినారు.

శ్రీధ—మరియునో గురునాథం!

చ॥ కలిగినవారినిన్ కలిమిలేక ల్గనివారిని కానివారినిన్
విలువగలట్టివారిని, నవీనత లేనట్టివంటి వారినిన్
తెలివివిహీనులన్ మునిగి తేలినవారిని యెల్లవారినిన్
కలతనులేనిభంగి నొకకంటను గాంతురు నూత్నపాలకుల్.

గురు—తోకలుకలిగిన వారినీ, తోకలులేని వారిని కూడా సమానతుల్యముగా జూచుకొనుచున్నారా మనపాలక మహానుభావులు.

శ్రీధ— రామరాజ్యమును ధిక్కరింపజాల గలిగినది మన యిప్పటి పంచాయతీ ప్రజారాజ్యము గురునాథం!

చ॥ శిథిలముకాగనున్న నిజశిల్పకులాలకు మేళగాండ్రకున్
కదురుకలాలకున్ పయిగ కర్షకకార్మికచిత్రకార్మికున్
చదివిన యెల్లవారికిని చాలినపుష్టినియీయజాలుమేల్
సుధలను జూరజేయుటకు జూచుచు నుండిరి పూజ్య
మూర్తులై.

గురు—మీవంటి ప్రచారకమహాశయులకు యీనాడు బహుమతు లీయుదురట.

శ్రీధ—చిక్కిన ప్రజాద్రోహులను గ్రామములయందు తిరుగుటకు వీలులేకుండా బహిష్కరింతురట.

గుండు—ఉమా గంగాధరుల శిలాప్రతిమలను వీధివీధు లందు నిలిపి పూజింతురట.

శ్రీధ—ఇదేనదీ పంచాయతీ సభామంటపమునకు చేసుకొనుట మంచిదే పదా.

(నిష్క్రమించును)

**

12

# సభామంటపము

[గ్రామ పంచాయతీ సభారంభ సమయములో చంపయను కన్యకారత్నము శాస్త్రయుక్తముగా నృత్యము చేయుచుండును సభాపీఠములపై ప్రసాదరావు, శేఖరం, చంద్రిం, గిరిధరుడు, రాజ్యం, శ్రీధరుడు, గురునాథం, గౌరీనాథుడు వగైరా ప్రముఖులు కూర్చొనియుందురు. నృత్యానంతరం ప్రసాదుడు సభాధ్యక్ష పీఠమునుంచి లేచి]

ప్రసా—సభికులారా! గ్రామపంచాయతీ ప్రభుత్వ పాలకు లెవరికి బహుమతు లీయనున్నారో మీకు మనచంద్రం

నివేదింపగలడు. పిదప తమ యంగీకార సూచనల నిమిత్తమై వేచియుందుము...

ఎల్లరు—(జేజేలు)

చంద్రం—(లేచి) ఉమాదేవిగారి శిష్యురాలైన చంప యను కన్యకారత్నము నేటి పంచాయతీ సభారంభసమయమున అమోఘముగా తన నృత్యగాన నైపుణ్యాభినయములచే సభికులను ఆనందపరవశులను గాజేసి నృత్యకళకు వన్నెను చేకూర్చినది. గనుక సువర్ణపతకమును బహూకరింప నుంటిమి.

సభ—(జేజేలు)

చంద్ర—మరియూ గ్రామపంచాయతీ ప్రజాప్రభుత్వ ప్రచారక మహానుభావులయిన శ్రీ శ్రీ శ్రీ శ్రీధరరావుగారు స్వర్గీయులైన వుమాగంగాధరుల జీవితగాథలను నాటకరూపకముగా రచించి వన్నియను బెట్టినారు. గనుక వారికి దీనజనాశ్రమములో భూదానసన్మానమును గావించుటయే గాక తగిన నటకులచే యనేకగ్రామాదులలో ప్రదర్శింపజేయుటను సంసిద్ధముగా నుంటిమి...

సభి—(జేజేలు)

గురు—(లేచి)(ఒక శ్లోకము గూడాయియాయుటమంచిది...

చంద్రం—మరియూ, వేతనారహిత గ్రామరక్షక దళాధికారిగా మన యీ గురునాథుడు.

శ్రీధ—అంటే యిడ్లీసింహాద్రుడు, యిడ్లీభీముడు.

చంద్ర—పని చేయుచూ కాంతయ్యలాగంటి దేశద్రోహులను ప్రభుత్వమువారిపరము జేయుచూ శాంతి భద్రతలను మహాకుతూహలముతో కాపాడజాల గలుగుచున్నందులకు వారికి చాలినంత వేతన మొసంగుటయే గాక 'సర్దార్' అను బిరుదుకూడా యివ్వడమైనది.

శ్రీధ—అంటే తోకనుకూడా ఈయటమైనది.

సభికు—సర్దార్ గుర్రానికీజై! వాని తోకకూజై!

చంద్ర—ఇక గ్రామ పంచాయతీ ప్రభుత్వరహస్య పరిశోధక వర్గీయుడైన రామానందుడు దేశద్రోహుల యాసాక్షిని రక్షకాధికారులకు తెలుపుచున్నందులకు కొలది రోజులలో ప్రమోషను బొందగలడు.

సభి—జై రామానందునకూ జై

చంద్రం—ఇంతటితో బహుమతుల జాబితా పని ముగిసినది.

ప్రసా—ఇక బహిష్కరణల విషయమునుకూడా వినిపించుము.

చంద్రం—ప్రజావిరుద్ధ చట్టములనూ, శాసనములనూ గౌరవించి శాంతి భద్రతలను చికాకుపరచిన గణపతిని సకుటుంబముగా గ్రామ బహిష్కరణను చేయటమైనది.

సభికులు—(జే జేలు)

చంద్రం—లక్ష్మీపతి గణపతి శ్రీపతులకుతోడుపడుచూ

వారు చేసిన ద్రోహములకు జేయూత నిడియున్నందుకు పది వత్సరములు గ్రామమునుంచి బహిష్కరించబడినది.

సభికులు—(చప్పట్లు కొట్టుదురు)

చంద్ర—స్వగ్రామ బహిష్కరణచే మన గ్రామము నకు చేరి యింతటి కల్లోలమును లేవదీసిన కాంతయ్యకు ద్వీపాంతరవాసశిక్ష విధించబడినది.

శేఖరం—ప్రవేశపెట్టనున్న నూతన చట్టములు.

సభ—(జేజేలు)

శేఖరం—లోగడ పాలకులు కేవలము సాక్ష్యముపై నాధారపడి తీర్పులనిచ్చి యుండుటచే కొందరు బీదలు దుర వస్థలకు లోనైపోయిరి. కనుక తగిన పరిశోధకులను నియ మించి వారివలన ప్రభుత్వమువారే నిజానిజములను గ్రహించి న్యాయసమ్మతముగా పాలింపవలయునను తీర్మానమును బల పరతురుగాక.

ఎల్లరూ...(జేజేలు)

గిరిధర్—కవులనూ, గాయకులనూ, నటకులనూ, హరి దాసులను మిగిలిన కళాకోవిదులనుకూడా పంచాయతీ ప్రజా ప్రభుత్వ ప్రచారక వర్గీయులనుగా నెకొని పోషింపవలయునను తీర్మానమును కూడా బలపరతురుగాక.

ఎల్లరూ (జేజేలు)

ప్రసా—శ్రీధరు ఆశీస్సుతో సభముగియును.

శ్రీధరుడు—(లేచి)

సీ॥ గ్రామికకృషులనుంచి క్రమముగా పాలించు
ఘనులకు స్థిరకీర్తి గలుగుగాత
కాంగ్రెసుసంస్థ వికాసంబుతో చిరం
జీవితమై విరాజిల్లుగాత
కర్షక, కార్మికుల్ కలసి సిరిక్షీర
మాలభాతి మొలకుచు వెలుగుగాత
పాడిపంటలచేత పల్లెలు బస్తీలు
కళ్యాణమయమౌచు గ్రాలుగాత.

తే॥ చట్టహితముగ పాలన జరుగుగాత
ధర్మచక్ర పతాకంబు ధరణిపైని
శాశ్వతంబుగ నిలిచి నిశ్శంకతోడ
మేలుగావుత రవిసోము లేలువరకు.

ఎల్లరు— ( జే జే లు )

మంగళం మహత్.

శ్రీ శ్రీ శ్రీ

మాతృభూమి ప్రెస్, విజయవాడ.

# తప్పొప్పుల పట్టి.



| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 17 | లోపదేమున్న | లోపమున్నదే |
| 9 | 10 | యింగిలీకపు | యింగ్లీషుసేవకు |
| | 11 | గ్రంథముపూయు | సారముగ్రోలు |
| 10 | 12 | రాయగలవె | వ్రాయగలవె |
| 15 | 4 | పూర్వపు | పూజ్యపు |
| | 6 | చూచిలి | చూచితి |
| | 16 | పాతు | పాత్య |
| 18 | 14 | శాజీయులు | శాఖీయులు |
| 19 | 19 | శకునులాల | శకునులార |
| 20 | 8 | మరి ూా | మరియూ |
| | 17 | కాంగ్రెస్ | కాంగ్రెసు |
| 22 | 11 | విండముల | విందముల |
| | 18 | సంగర | సంగ |
| 23 | 12 | సోదరుతా రా | సోదరులారా |
| | 15 | చిక్కులు | బిక్కులు |
| 25 | 5 | దిడ్డుచు | దిద్దుచు |
| | 6 | జోలపాట | జోలపాట |

ముద్రించుసమయమున నేను లేనందున తప్పు లింకను యుండవచ్చును. గాన క్షమింపుడు. —'రాయసం'

రచన : సీతంరాజు వెంకటేశ్వరరావు—విజయవాడ.

## పాటలు

### 1

శ్రీధరుడు

యెగిరింది జాతీయ జెండ

 నదురుబెదురు లేక నాట్యమాడుచు జెండ ॥యె॥

మూడు రంగులజెండ – ముచ్చటైనా జెండ

మురిపాల ముద్దుతో ముందడుగు వేసింది ॥యెగి॥

మనసుమనసూకలసి మనమంత మ్రొక్కితే

ఆసీర్వదిస్తుంది మన తెలుగుజెండ ॥యెగి॥

### 2

[1వ, సీను ఆఖరున శ్రీధరుడు]

"ఝుంఝుంబడసె" మాదిరి

లెమ్మూ, రమ్మూ, భారతవీరా – స్వాతంత్ర్యసమరాధీరా

జగతికన్నదాతారా వో – జగతికన్నదాత ॥లెమ్ము॥

దేశద్రోహుల జులుం కాహుతైపోతావా, పోతావా

పేదసోదరుల నుద్ధరింపగరాలేవా, రాలేవా ॥లెమ్ము॥

స్వార్థపరులను తరిమివేసి – స్వాతంత్ర్యదీక్షాబూని

జగతికన్నదాతారావో – జగతికన్నదాత ॥లెమ్ము॥

### 3

(2వ సీను ప్రారంభమున)

( ఓహోహో మహాత్మా మాదిరి )

ఆహాహామహాత్మా – నీమేలు మరువలేమోయి ॥ఆహాహా॥

సత్యాగ్రహముల సలిపినాడవు–స్వరాజ్యరథమును సాధించావు

॥ఆహా॥

అందరు మానవులొక్కటేయంచు - జ సినప్పుడే ఆ హ్వాపు
వింతరాక్షసులగుండు దెబ్బకు ప్రపంచ మొదిలిపోయావు ॥ఆహా॥

4

(శివ సీను ప్రారంభమున శ్రీధరుడు)

("మేలుకో ఓ న్యాయవాది" అన్నమాదిరి)

మేలుకో - ఓ భారతవీరా - మేలుకో
ఆంధ్రదేశము నీది - ఆంధ్రవీరుడ నీవు
ఆంధ్రత్వమేమిటో తెలుపంగ లేవోయి ॥మేలు॥
సర్వమతములు నేడు యేకమైపోవాలి
సర్వజనులకు ముందు శాంతిచేకూరాలి
గ్రామక్షేమమె నీవు సర్వదాకోరాలి ॥మేలు॥

5

( శివ సీను ఆఖరున శ్రీధరుడు )

(రాగం మాల్ కౌన్)

పచ్చపెట్టెలో వోటు వేయండి
మీరు పచ్చపెట్టెలో ఓటు వేయండి ॥పచ్చ॥
పవిత్రమైన భారతభూమికి
పచ్చపెట్టెయే శుభప్రదంబు ॥పచ్చ॥
లంచాలకాసించి మోసపోకండి
మంచికావాలంటే మాకు వోటెయ్యండి ॥పచ్చ॥
మనము మనము కలసి మంచిగా వుండాలి
యేక మాటగ మనము నడుచుకోవాలి ॥పచ్చ॥
భారతీయుల పంట పండు
ముందు భారతీయుల కడుపునిండు
గ్రామక్షేమమె - నీదు క్షేమమని యెంచి

పచ్చపెట్టెలో వోటు వేయండి ॥పచ్చ॥
(ఈ పాటను రెండోసారి ఓటింగ్ సమయంలోకూడ
పాడవచ్చును)

6

(7 వ సీను ఆఖరున శ్రీధరుడు)

(రాగం:- సివరంజిని)

ఇంతేనా - భారతీయుల గతింతేనా ॥ఇంతే॥
న్యాయవాదులకు మార్గమే లేదా
న్యాయమార్గమె నశించెనా యిలపై ॥ఇంతే॥
భారతీయులకు గెలుపే లేదా యెన్నికలలో రాలేరా ॥ఇంతే॥

7

(9 వ సీను ఆఖరున - కోరస్)

రాగం:- మోహన - తాళం ఆది

లేవండోయ్ - లేవండోయ్
ప్రజాద్రోహులను తరిమివేయగ
ప్రచండశబ్దం చేయండోయ్ ॥లేవం॥
ప్రజాక్షేమమే దేశక్షేమమని
యేకమాటగ తెల్పండోయ్ ॥లేవం॥
లంచగొండులను లేవనీయక
బ్లాక్ మార్కెట్టుని బ్రద్దలుచేయగ
దుర్వ్యసనాలకు దూరము చేయగ
సర్వమతాలను సమచేయంగ
భారతదేశం భాగ్యోన్నతికై
పాటుపడంగ లేవండోయ్ ॥లేవం॥



శ్రీయుత ఏలూరు కాపురస్థులు
గంధం బ్రహ్మన్నగారు నాయందు
గల స్నేహవాత్సలతచేత వుత్సా
హము గలుగజేశి వారు వారి
మిత్రులచేత ధన సహాయము
చేశినందులకు వారికి ధన్యవాద
ములు అర్పించుచున్నాను.

ఇట్లు
పో. రామమూర్తి,
గవర్నరుపేట – విజయవాడ.



## గ్రంథకర్త రాయసం వెంకటరమణయ్య

అచ్చయిన పుస్తకములు

* మఱిష్మత్
* విద్యావతి
* చింతపూలు



అచ్చుకానున్న పుస్తకములు

* భీమకవి
* రామబాణము
* విద్యానాథుడు
* తార
* చిత్రిక



దొరకుస్థలము:



[illegible] రామమూర్తి,



[illegible] విజయవాడ.